# The
# Andhra Pradesh Legislative Assembly
# Debates

[*Part II-Proceedings other than Questions and Answers*]

## OFFICIAL REPORT

**49th day of the Sixth Session of the Andhra Pradesh Legislative Assembly**

## ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY

**Saturday, the 22nd March 1958.**

The House met at Half Past Eight of the Clock.

[ *Mr. Speaker in the Chair* ]

## QUESTIONS AND ANSWERS

( *See Part I* )

### Report of the Select Committee on the Madras Entertainment Tax ( Andhra Pradesh Extension and Amendment) Bill, 1958.

*The Minister for Finance ( Dr B. Gopala Reddi ):* Sir, I beg to present the Report of the Select Committee on the Madras Entertainments Tax (Andhra Pradesh Extension and Amendment) Bill, 1958"

*Mr Speaker*: Report presented.

## BUDGET—DEMANDS FOR GRANTS

*-Demand No. XXIV—Industries - Rs. 1,66,97,800.*

*-Demand No. XLIII—Capital out-lay on Industrial Development - Rs. 1,75,30,000.*

*The Chief Minister (Sri N.Sanjeeva Reddy):* Mr. Speaker, Sir. On the recommendation of the Governor, I beg to move:

"That the Government be granted a sum not exceeding Rs. 1,66,97,800 under Demand No. XXIV Industries."

"That the Government be granted a sum not exceeding Rs 1,75,30,000 under Demand No. XLIII Capital Outlay on Industrial Development."

*Mr. Speaker*: Motions moved.

*శ్రీ ఎస్. సంజీవరెడ్డి: అధ్యక్షా: గడచిన సంవత్సరము నేను చెప్పినవిషయాల కంటే ఎక్కువగా ఈ రోజుచెప్పవలసినది లేదు. పరిశ్రమలకు సంబంధించి నంతవరకు ప్రతి సంవత్సరము కొత్తగా ప్రారంభించేవి వుండవు. ఉన్న పరిశ్రమలను సరిదిద్దుకోవటం, సక్రమంగా లేనివాటిని సరిగానడిచేటట్లు చేయటం, పరిశ్రమలలో ఎక్కువ లాభాలు సంపాదించటానికి కృషిచేయటం, లోపాలు వుంటే వాటినిదిద్దుకోవటంమాత్రమే జరుగుతున్నవి. హైదరాబాదు ప్రాంతములోని పరిశ్రమలలో ఏ పరిశ్రమలో ఎంతడబ్బువున్నది? భాగాల రూపంలో ఎంతవున్నదీ, అప్పుల రూపంలో ఎంతవున్నదీ, ఎంత పర్సెంట్ షేర్ వున్నది, దీనిలోని లాభనష్టాల లెక్కలను విపులంగా సభ్యులకు గత సంవత్సరం అందచేశాము. అందులో 54% మించి హెచ్చుగావున్న కంపెనీలలోని కార్యక్రమము జాగ్రత్తగా నడుపటానికి ప్రభుత్వము కృషిచేసినది. ముఖ్యముగా నిజాం సుగర్ ఫ్యాక్టరి, ప్రాగాటూల్స్, సింగరేణి బొగ్గుగనులు- ఈ మూడింటి విషయములో ప్రభుత్వము ఎక్కువశ్రద్ధ వహిస్తున్నది. నిజాంషుగర్ ఫ్యాక్టరి బాగా పనిచేస్తోంది. యింకా బాగా పనిచేయటానికి అవకాశాలు వున్నాయని ప్రభుత్వము భావించటంవల్ల మానేజింగ్ ఏజన్సీలలో వారి ఎప్రూవల్ తో ఒక ఉద్యోగిని అక్కడ నియమిస్తే మంచిదని భావించి, అపరేటివ్ డైరెక్టరుగా ఒక I. A. S. Officer ను అక్కడ ప్రభుత్వము నియమించింది. ఆ సంగతి గౌరవసభ్యులందరికి తెలుసు. వారు ఆ బాధ్యతను వహించిన పిదప యింకా హెచ్చులాభాలు రావటానికి అవకాశములు వున్నాయనే అభిప్రాయాన్ని వెలిబుచ్చటమే కాక అనేక విధముల ప్రయత్నించారు. ఈ సంవత్సరం, ప్రతి సంవత్సరం వచ్చేలాభాలకు మించి వస్తుందని ఆశిస్తున్నాము. ఏమైనా అవకతవకలు జరిగితే మేనేజింగ్ ఏజన్సీద్వారా, మేనేజింగ్ బోర్డుద్వారా ఆ తప్పును దిద్దుకోవచ్చును.

ఇక వ్యవసాయకల్చరల్ సెక్టారులో నిజాంషుగర్ ఫ్యాక్టరిలోని 16 వేలఎకరాల పొలములో వ్యవసాయ ఖర్చు ఎక్కువగా వుంటున్నది. ఇతర ఫ్యాక్టరీలలో

కంటే ప్రైవేటు వ్యవసాయదారునికి అవుతున్న ఖర్చుకంటే దీనిలో ఎక్కువ ఖర్చు అవుతున్నది. దానిని సవరించటానికి ప్రయత్నాలు జరుగుతున్నవి. ఆ పనికూడా పూర్తిఅయితే ఇప్పుడు వస్తున్న ఆదాయాన్ని ద్విగుణీకృతం చేయటానికి అవకాశములు వుంటాయని ఆశిస్తున్నాము. గడచిన సంవత్సరము 42 లక్షల ఆదాయము కంపెనివారి అంచనా ప్రకారం వచ్చింది ఈ 42 లక్షలు ఎక్కువగానే కన్పించవచ్చు, కాని అది ప్రభుత్వానికి తృప్తికరముగా లేదని ఆ 42 లక్షలు 82 లక్షలుచేయటానికి అవకాశములు వున్నాయనే భావం కల్గటం వల్లనే ఆపరేటివ్ డైరెక్టరుని నియమించటం జరిగింది.

సింగరేణి బొగ్గుగనుల విషయమును అనేకసార్లు ప్రశ్నల సందర్భంలో మనవిచేశాను. ఇప్పటివరకు అది బాగానే పనిచేస్తున్నది. ఆశించిన దానికన్న ఎక్కువ బొగ్గు ఉత్పత్తి అవుతున్నది. ఇప్పుడు దాదాపు రెండు మిలియనుల టన్నుల వరకు ప్రొడక్షన్ ఎక్కువ అయినది. మనం యింకా మెకనైజ్‌చేసి కొంతడబ్బు ఖర్చుపెట్టినట్లయితే, ఆశించినంతగా ఏడుకోట్లు కాకపోయినా కనీసము నాలుగుకోట్లు రూపాయలు ఖర్చుపెట్టినా, మూడు మిలియనుల టార్జెట్టును రీచ్ కావడానికి వీలు అవుతుంది. ఈ అప్పును మంజూరు చేయ వలసినదిగా ఢిల్లీ ప్రభుత్వానికి వ్రాశాము. ఢిల్లీప్రభుత్వం యిందులో 66% షేర్పు యిచ్చినట్లయితే, డబ్బు ఖర్చుపెట్టి ప్రొడక్షన్ ఇంక్రీజు చేయడానికి తోడ్పడతామని అన్నారు. గతసంవత్సర శాసనసభా బడ్జెట్టు సమావేశాలలో "చక్కగా నడుస్తున్నదానిని రాష్ట్రప్రభుత్వమే నడపాలని, ఢిల్లీప్రభుత్వాన్ని నాలుగుకోట్లు కనీసము అప్పుగా అడగాలని" సభ్యులు సూచించారు. ఆ సూచనలను పాటించే ఢిల్లీ ప్రభుత్వాన్ని నాలుగుకోట్లు అప్పుగా యివ్వమనికోరాము. దక్షిణ భారతములో కావలసినంత బొగ్గు ఉత్పత్తి కావడంలేదు. ఇక్కడ రైళ్ళకు, పరిశ్రమలకు కావలసిన బొగ్గు బీహారు బెంగాలు ప్రాంతాలనుంచి తెచ్చుకోవలసివస్తున్నది. అంతదూర ప్రదేశాలనుంచి దిగుమతి చేసి తెచ్చుకోవడంవల్ల లక్షలాది రూపాయలు ఖర్చు అవుతున్నది. ఆడబ్బు అంతా transport కోసం ఖర్చుఅవుతోంది. ఇది wasteful expenditure. అందువల్ల బొగ్గుగనులు అభివృద్ధిచేసి దక్షిణ భారతదేశంలో రైళ్ళకు, పరిశ్రమలకు కావలసిన బొగ్గును ఉత్పత్తి చేసుకోవలసియున్నది. అనవసరంగా ప్రతిసంవత్సరం ఖర్చుపెట్టేది ఒక్కసారే ఖర్చుపెట్టినట్లయితే బాగుంటుందని ఢిల్లీ ప్రభుత్వానికి వ్రాశాము. వ్రాయడమే కాకుండా యింకా యితర ఉద్యోగులు, నేను వెళ్లిచెప్పాము కాని అది వారికి నచ్చలేదు. క్రొత్తగా ప్రారంభిస్తున్న ప్రతిబొగ్గుగని నేషనలైజేషన్ సెక్టర్‌లో ఉండాలి. లేకపోతే మాకు

హెచ్చుభాగముండాలి" అనిచెప్పారు. ఇప్పుడు ఈ బొగ్గుగనులు నేషనలైజేషన్ సెక్టరులోనేఉన్నాయి, రాష్ట్రప్రభుత్వానికి 88 షేర్సుఉన్నాయి. 12 షేర్సు మాత్రమే యితరులచేతులలో ఉన్నవి. సెంట్రల్ ప్రభుత్వంబదులు, రాష్ట్ర ప్రభుత్వ అజమాయిషీలో ఉంటుంది. రాష్ట్ర ప్రభుత్వాన్ని ప్రైవేటు వ్యక్తిగా భావించకుండా ఆర్థికసహాయంచేయమని కోరాము. దీనికి సరియైన సమాధానం యింతవరకు రాలేదు. కాలయాపన అయిపోతోంది. ప్రొడక్షన్ ఇంక్రీజ్ చేయడానికి అవకాశం ఉండికూడ చేయలేకపోతున్నాం! అందుచేత ఒక బ్యాంకుతో సంప్రదింపులు ప్రారంభించాము. సక్రమంగా జరుగుతున్న కంపెనీకి అప్పుయివ్వడానికి యెవరైనా అంగీకరిస్తారు. ఆ కంపెనీ బేలన్సు షీటులోని ఎస్టేట్సుఫండ్ లైబిలిటీస్ అన్నీ చూచి ఒక బ్యాంకు ఆ కంపెనీకి ఒక కోటి రూపాయలు అప్పుగా యివ్వడానికి అంగీకరించింది. రాష్ట్ర ప్రభుత్వ గ్యారంటీపై అప్పు యివ్వడానికి అంగీకరించారు. ఢిల్లీ ప్రభుత్వం సరియైన కాలంలో తోడ్పడి, అప్పు యివ్వడానికి అంగీకరించక పోయినా, బ్యాంకులద్వారా అప్పులు సంపాదించి మూడుమిలియనుల టన్నులు ప్రొడక్షన్‌చేయలేకపోయినా కనీసము 2.5 లక్షల టన్నులు అయినా, రానున్న రెండు మూడు సంవత్సరాలలో చేయాలని నిశ్చయించుకొన్నాము.

శ్రీ ఆర్. నారాయణరెడ్డి: ఏ బ్యాంకు?

శ్రీ యన్. సంజీవరెడ్డి: ఇండియన్ బ్యాంకు. అంతకుముందు యిచ్చిన బ్యాంకే! ఒక కంపెనీకి రెండు మూడు బ్యాంకులు అప్పు యివ్వవు. ఒక్క బ్యాంకు యిస్తున్నప్పుడు యింకోబ్యాంకు ఇంటర్‌ఫియరుకాదు. Highest priority మొదటి బ్యాంకుకే వస్తుంది. రేటు ఆఫ్ ఇంటరెస్టు మొదలైన విషయాల పై గోపాలరెడ్డిగారు మదరాసు వెళ్ళినప్పుడు సంప్రదించి ఫైనలైజు చేశారు. కనీసము నాలుగుకోట్ల రూపాయలు అప్పుగా దొరికినట్లయితే మూడు మిలియన్సుకు reach కావడానికి అవకాశంఉంటుంది. దానివల్ల యావత్తు భారత దేశానికి ఉపకారం జరుగుతుంది. రైల్వేరేట్లు తగ్గించడానికి - శాశ్వతంగా తగ్గించడానికి అవకాశం ఉంటుంది. బీహారు, బెంగాలులనుంచి బొగ్గును దిగుమతి చేసుకొనుటవల్ల అయ్యేఖర్చును తగ్గించుకోవచ్చును. ఈ చిన్న విషయంలో ఢిల్లీప్రభుత్వం అర్థంచేసుకొని మనకు సహకారంచేస్తుందని విశ్వసిస్తున్నాము. వారికి యింకా అర్థంకాకపోతే, మిత్రులు గోపాలరెడ్డి గారు అక్కడకు వెళ్ళిన తరువాత అక్కడ మిత్రులకు అర్థం అయ్యేటట్లు చెప్పి ఢిల్లీ ప్రభుత్వం చేత ఒప్పించుటకు ప్రయత్నిస్తారని ఆశిస్తున్నాను.

ఇక ప్రాగాటూల్సు విషయం ప్రతిసంవత్సరం నష్టం వస్తూండేది. కాని యిప్పుడు కొద్దిలాభాన్ని చూపగల్గుతోంది దీనివిషయంలో మనం ఢిల్లీప్రభుత్వ సహాయాన్ని తీసుకోవడానికి అంగీకరించాము. ఆంధ్రప్రదేశ్ కాకపూర్వమే ఈ ఏర్పాటు జరిగింది. ప్రతి సంవత్సరం వస్తున్న నష్టాన్ని తగ్గించుకొనుటకు యెన్నోరకాలుగా ఉత్పత్తిచేస్తున్న వస్తువులను మానివేసి, కొద్దిరకాల వస్తువులను మాత్రమే తయారు చేసి ఒకటి రెండు లక్షల రూపాయలు లాభం వచ్చేటట్లు చేశాము. ఇక ఢిల్లీ ప్రభుత్వం దానిపై ఏ 80 లక్షలో లేక ఒక కోటి రూపాయలో పెట్టుబడి పెట్టినట్లయితే, అది అభివృద్ధి పొందుతుందని ఆశిస్తున్నాము.

ఒక నిర్ణయానికి రాలేకుండా ప్రభుత్వం బాధపడుతున్నది. ఆల్విన్ మెటల్ వర్క్సు, ఏస్‌బెస్టస్ చాలా మంచి పరిశ్రమలు నేను కూడ ఒక సారి పరిశీలించి వచ్చాను. మంచి భవిష్యత్తుగలిగిన పరిశ్రమలు యివి. చక్కనివస్తువులు తయారు చేయుటకు కావలసిన సామాగ్రి, కావలసిన మనుష్యులు అందరూ ఉన్నారు. ఆ కంపెనీకి వస్తున్న నష్టాన్ని అది భరించలేకుండా యున్నది. ఆ నష్టాన్ని ఎట్లాగ పూడ్చడం? ఆనష్టాన్ని పూడ్చకపోతే యెవరూ అప్పు యివ్వరు. ఇప్పుడు ఉన్న ఆస్థి, అప్పులు తీర్చటానికి సరిపోతుంది. షేర్సు ధనం హెచ్చుగా మిగిలేటట్లు కనపడదు. కాబట్టి షేర్సుధనం తగ్గించి ప్రయివేట్ సెక్టరులో, యితర వ్యక్తులనుంచి కూడ సహాయం లభించుటకు, ప్రభుత్వం తీవ్రంగా ఆలోచించింది. కాబట్టి, షేరుకాపిటల్‌ను తగ్గించి, ప్రయివేటు కేపిటల్‌ను attract చేయడానికి నిశ్చయించుకొన్నది. బిర్లా కంపెనీవారు దీనిని మేనేజ్ చేస్తున్నారు. మేనేజింగు యేజెన్సీను మార్చకుండా ఉన్నా ఫరవాలేదు. ప్రతి సంవత్సరం వస్తున్న నష్టాన్ని నిలిపి, కొద్దిలాభంతో పనిచేసేటట్లు చేశారు. Efficient management వల్ల అయితేనేమి, గట్టిగా ప్రయత్నించడం వల్ల అయితేనేమి ఆపని జరిగింది. అప్పులు హెచ్చుగా ఉండుటవల్ల 30,40 లక్షల రూపాయలు తెచ్చిపెట్టినప్పటికి అది అప్పులు తీర్చడానికి సరిపోతుంది కాబట్టి, కంపెనీ షేరుధనమును 50 రూపాయలు ఉన్నదానిని పది రూపాయలకు తగ్గించి, క్రొత్త capital సమకూర్చి దానిని working condition లో పెట్టడానికి వీలు అవుతుందేమో అని ఆలోచించాము.

కానీ ఒక్కసారి ఈ కంపెనీని private capital shares కు తేవడం వల్ల అది ప్రభుత్వ స్వాధీనంలోనుంచి వెళ్ళిపోతుంది. అందుకు ప్రభుత్వం అంగీకరించలేదు. భవిష్యత్ ఉన్న కంపెనీ అనియు, ముందు బాగా ఉపయోగపడే కంపెనీ అని తెలుసుకొన్న తరువాత, ప్రభుత్వానికి ఉన్న majority shares ను పోగొట్టుకోవడం ఇష్టం లేకపోవడంవల్ల ఒక

condition పెట్టి ఈవ్యవహారాన్ని సాగించాలని ప్రభుత్వం ఆలోచిస్తోంది. పది సంవత్సరాల తరువాతనైనాసరే, ప్రభుత్వం కావాలంటే తన 54% shares కొనడానికి హక్కు ఉంచుకొని, ఈ condition కు లోబడే private capital తెప్పించడానికి ఆలోచిస్తోంది. దీనికి అంగీకరించడంతప్ప, నాకు వేరే మార్గం కనిపించడంలేదు.ఈ condition కు లోబడి, ఈ కంపెనీకి private capital ఎవరైనా invest చేయడానికి సిద్ధంగాఉంటే, రండీ అని ఆహ్వానిస్తున్నాను.

Sirpur paper and Sir Silk Mills విషయం చూద్దాం. ఈ రెండు కంపెనీలను కలపాలనే అపేక్షవాటి management వారికి కలిగింది. Sirpur Paper Mills లో 14%, Sir Silk లో 24% లేక 25% shares ప్రభుత్వానికి ఉన్నాయి. కానీ ప్రభుత్వం వీటికి రు. 3 కోట్లు అప్పు రూపంలో ఇచ్చింది. ఈ కంపెనీలకు లాభాలేమీ రావడంలేదు. వీటి Managing Agents అయిన Birla వారు ఉన్న నష్టాన్ని తగ్గించి, ఏదోరకంగా వీటిని నడపాలనే భావంలో కార్యక్రమం సాగిస్తున్నారే కాని, హెచ్చుగా లాభాలు వచ్చి అప్పులువెంటనే తీర్చివేయగల అవకాశాలు కనిపించడంలేదు. కానీ paper mill బాగా develop చేస్తున్నారు. లాభాలు కొంచెం హెచ్చుగా వస్తున్నాయి. దీనిలోఉన్న properties విలువ ఎక్కువగానే ఉంది. ఈ రెండు factories ను— Paper & Silk— కలిపితే ప్రభుత్వానికి నష్టమేమీలేదని భావిస్తోంది. ఇచ్చిన అప్పు త్వరగా వెనక్కి రావడానికి అవకాశం ఉంటుంది. ఈవిధంగా కలపడంవల్ల ప్రభుత్వం ఇచ్చిన అప్పు మొత్తానికి ఎక్కువ security కలుగుతుందనే విశ్వాసంతో ఆపద్ధతికి అంగీకరించడం మంచిదని తోచింది.

ఇంక చిన్నచిన్న కంపెనీలు ఉన్నాయి. Taj Glass Works మాత్రం మాకు కొంత బాధ కలిగిస్తోంది. దీనిని liquidation కు తీసుకుపోవడం తప్ప వేరే శరణ్యం ఏమీలేదని తోస్తోంది. దీనిని liquidate చేసి ఎవరైన కొందరు వ్యక్తులు తీసుకొని నడిపితే, అది ఏమైనా బాగుపడుతుందేమో కానీ, ఇప్పుడు ప్రభుత్వం ఎక్కువ shares ఇచ్చి కాని, లేకపోతే ఎక్కువ ఖర్చుపెట్టికాని సహాయంచేసే స్థితిలో లేదు. ఎందువల్లనంటే పోయిన డబ్బుకు సాయం, ఈ డబ్బుకూడా పోతుందేమోనన్న అనుమానం ఉంది. ఇకముందు ఏవిధంగాను ఈ Taj Glass Works లో ప్రభుత్వం డబ్బు పెట్టకూడదనే నిర్ణయానికి వచ్చింది.

ఇక chemicals & fertilisers వ్యవహారం అంత తృప్తికరంగాలేదు. ఇది చాలా నష్టంతో పని చేస్తోంది. హైద్రాబాద్ ప్రభుత్వం పాలనలో వారికి అప్పు ఇవ్వడం, ప్రభుత్వమే వారి సరుకులు కొని దైతులకు సప్లై చేయడంవల్ల ఈ

కంపెనీ చావకుండా బ్రతుకుతూ వచ్చింది. ఈ కంపెనీకి లాభాలు ఎక్కువ ఏమీ లేవు. చాలా over staff అయిపోయింది సంపాదించేదానికన్నా హెచ్చుగానే కూలీలక్రింద officers క్రింద ఖర్చు అవుతోంది. ప్రభుత్వం ఇచ్చే సహకారంవల్ల కంపెనీ ఏదో అట్లా నడుస్తూవుంది. కంపెనీని సజీవంగా ఉంచడంకోసం ప్రభుత్వం ఎరువులు కొని, అప్పు ఇవ్వడం సాధ్యం కాదనియు, ఏదైనా economy చేసుకోమనియు, ఇంకొక సంవత్సరం కన్నా ప్రభుత్వంనుంచి ఈ రకమైన సహకారం ఆశించవద్దనియు సలహా ఇచ్చాము. వారేమైనా మార్పులు తీసుకువస్తే సరేసరి లేకపోతే వచ్చే సంవత్సరం మరొక నిర్ణయం తీసుకోవలసి వస్తుంది. మనం నడపడమో లేక liquidate చేయడమో ఆలోచించుకోవలసి ఉంటుంది.

రాజమండ్రీలో Paper Mills ఉన్నా అక్కడ చాలాతక్కువ production (పది టన్నులు) - జరుగుతోంది. ఇంత తక్కువ production తో Paper Mill నడపడం మంచిదికాదు కాబట్టి 50 టన్నులకు ఉత్పత్తిని పెంచాలని మన ఉద్దేశ్యం. దీనికి ఢిల్లీ ప్రభుత్వంకూడా దాదాపు అంగీకరించింది. ఈ plan ప్రకారం 50 టన్నులు ఉత్పత్తి చేయగలమని ఆశిస్తున్నాను.

ఇంక సిమ్మెంటు, పంచదారలను ఆంధ్రదేశంలో అభివృద్ధి చేయడానికి హెచ్చుగా అవకాశాలున్నవి. ఇప్పటికి ఆంధ్రప్రదేశ్‌లో ఎనిమిది sugar factories ఉన్నాయి. ఇంకా క్రొత్తవి పెట్టడానికి లైసెన్సులు తీసుకొన్నారు. వీటిలో కొన్ని co-operative basis మీద, కొన్ని private sectorలోను స్థాపించబడతాయి. (1) Sarvaraya Sugars Ltd, (2) Challapalli Sugars- (3) Krishna Industrial Corporation Ltd, (4) V. V. Sugars- ఈ నాలుగూ private sector లో స్థాపించబడుతున్నాయి. ఇక co-operative sector లో మనం ప్రయత్నంచేస్తూ, ఢిల్లీప్రభుత్వ సహకారాన్ని కోరుతున్న విషయాన్ని నేను పలు సార్లు మీముందు మాట్లాడాను. అది మీకందరికి తెలుసును.

ఇక సిమ్మెంటు చాలాకొరతగా ఉన్నదనియు, దీనిని హెచ్చుగా ఉత్పత్తి చేయవలెననేది అందరు అంగీకరించిన విషయమే. ఇప్పుడు ఆంధ్రదేశంలో రెండు సిమ్మెంటు ఫ్యాక్టరీలు మాత్రమే పనిచేస్తున్నాయి. కొన్ని క్రొత్త factories ప్రారంభించ బడుతున్నాయి. మాచర్లలోని రామకృష్ణ సిమ్మెంట్సు లిమిటెడ్, ఒక లక్ష టన్నుల capacity తో ప్రారంభించబడింది. అది ఉత్పత్తినికూడా ప్రారంభించింది. గుంటూరు జిల్లా నడికోడెలో రెండు లక్షల టన్నులు ఉత్పత్తి చేయడానికి లైసెన్సు ఇవ్వబడింది. వారేదో ప్రయత్నంచేస్తున్నారు. M/s The Indian

Cements Ltd., Vijayanagaram వారికి లక్ష టన్నులకు లైసెన్సు ఇవ్వబడింది. కడపలో ఒక లక్షా యిరువది ఆరు వేల టన్నుల factory పెట్టడానికి Rayalaseema Development Corporation, Kamalapuram వారికి లైసెన్సు ఇచ్చాము. పాణ్యం సిమ్మెంట్సుకు (కర్నూలు జిల్లా) 62,700 టన్నులకు లైసెన్సు ఇచ్చాము. వీటికి దాదాపు Machinery రావడం fit up కావడం మొదలైన కార్యక్రమం చురుకుగా జరుగుతోంది. అతిత్వరలోనే ఇవికూడా ఉత్పత్తి ప్రారంభిస్తాయి అనుకుంటున్నాను. A. C. C. Ltd., Erraguntla వారుకూడా లైసెన్సు తీసుకొన్నారు. కానీ ఇంతవరకు పని ప్రారంభించినట్లే కన్పించడంలేదు. A. C. C., Manchiryala వారికి ఒక లక్ష ముప్పైవేల టన్నులకు లైసెన్సు ఇవ్వబడింది, పని చురుకుగా సాగుతోంది. అతిత్వరలోనే ఉత్పత్తి ప్రారంభం కావచ్చుననుకొంటున్నాను. ఈ విధంగా ఏడు కంపెనీలు సిమ్మెంటు ఉత్పత్తికి పూనుకొన్నాయి. Private and public sectors లో పంచదార, సిమ్మెంటు పరిశ్రమలను ఎంతైనా అభివృద్ధిచేసుకోవడానికి మనకు అవకాశంఉంది Foreign exchange, import -licence మనకు లభ్యం అయితే వీటిని ఎంతైనా అభివృద్ధి చేసుకోవచ్చు. ఈ two bottle necks ను మనం over come చెయ్యాలి.

మన ఆంధ్రప్రదేశ్‌లో క్రొత్తపరిశ్రమలను ప్రారంభించవలసిందని కేంద్రప్రభుత్వాన్ని పలుసార్లు అడుగుతున్నాము. ఎరువుల ఫ్యాక్టరి; మాన్యుఫ్యాక్చర్ ఆఫ్ హెవీ కాస్టింగ్సు; స్టీల్‌స్ట్రక్చర్ & కార్బన్ బ్లాక్ ఫ్యాక్టరీ; డీసిల్ ఇంజిన్సు ఫ్యాక్టరీ; లో టెంపరేచర్ కార్బనైజేషన్ ప్లాంట్; ఇలాంటివి కావాలని ఎన్నోసార్లు ఢిల్లీ ప్రభుత్వానికి మన రాష్ట్రప్రభుత్వం తెలిపింది. ఇంతవరకు వీటి విషయంలో ఏచర్య తీసుకోనందుకు అసమ్మతిని తెలుపుకొన్నాము. కాని దురదృష్టవశాత్తు వాటిని వేటినీ ఇక్కడ ఏర్పాటు చేయడానికి అంగీకరించకపోవడం, ఒక్క News Print Factory ని నిజామాబాద్‌లో అక్కడ ఉన్న "బెగస్" ఉపయోగించి ఏర్పాటుచేయడానికి అంగీకరించడం, ఇప్పటికి జరిగిన ఫలితం. కాని దీనిని అంగీకరించి ఇప్పటికి సంవత్సరం అయినది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఏర్పడిన వెంటనే ఢిల్లీ ప్రభుత్వం నుంచి వారి మంత్రి ఒకరు సిబ్బందితో వచ్చి, ఇక్కడ విషయాలను చర్చించి ఒక Agreement కు రావడం జరిగింది, కానీతరువాత చర్యలేవి చురుకుగా జరిగినట్లు లేదు. "ఏవో మెషినరీకి ప్రయత్నం చేస్తున్నాము, foreign exchange కి కష్టంగా ఉందని" ఏవో చెబుతున్నారు కానీ, తృప్తికరంగా ఉండేచర్యలేవీ తీసుకొన్నట్లులేదు. ఈ విషయంలోకూడా కొంచెం వత్తిడి తెచ్చి, తొందరగా ఈ కార్యక్రమానికి పూనుకొనేటట్లు చెయ్యాలి.

ఎరువుల ఫ్యాక్టరీని private sector లో ఎవరైనా పెడితే, తమకేమీ ఆక్షేపణలేదనియు, తాము లైసెన్సు ఇవ్వాడానికి సిద్ధంగానే ఉన్నామనియు. ఢిల్లీప్రభుత్వానికి సంబంధించిన మంత్రులు మాకు చెప్పారు. Private sector లో ఇన్ని కోట్ల రూపాయిలు ఎవరుపెట్టగలరనే సమస్య రాష్ట్రప్రభుత్వం ఎదుటఉంది. ఎవరైనా వ్యక్తులు ఇతరదేశాల సహకారంతో ఈ ఎరువుల ఫ్యాక్టరీని పెట్టడానికి సిద్ధపడితే, రాష్ట్రప్రభుత్వము, డిల్లీప్రభుత్వముకూడా అందుకు సహాయం చేస్తాయి.

పెద్దపరిశ్రమలు ఎంత అభివృద్ధిఅయినా, చిన్న పరిశ్రమలు (cottage industries) అభివృద్ధి అయినరోజునే దేశాన్ని సౌభాగ్యవంతంగా చేసుకోవడానికి వీలు అవుతుందనే విషయం సభ్యులందరికీ తెలుసు. పెద్ద పరిశ్రమలతో కలిసి, చిన్న పరిశ్రమల కార్యక్రమం ముడిపడి ఉన్నంతవరకు, మనం ఈ చిన్న పరిశ్రమలపై దృష్టిని కేంద్రీకరించడం ఉండదు. వీటి విషయంలో ప్రత్యేకంగా శ్రద్ధ వహించి పనిచేయదానికి యువకులు, ఉత్సాహవంతులైన ఒక క్రొత్తమంత్రిగారిని ఏర్పాటు చేసికొన్నాము. దేశసౌభాగ్యం ఈ చిన్నపరిశ్రమలమీద ఆధారపడి ఉన్నదనే విషయం తెలిసికొన్న తరువాతనే మేము ఇందుకు పూనుకొన్నాము. వారు పట్టుదలతో, శ్రద్ధతో ఈ కార్యక్రమానికి పూనుకొన్నారు. ఇక రానున్న సంవత్సరాలలో సత్ఫలితాలు చూడడానికి వీలు అవుతుందని ఆశిస్తున్నాము.

ఇక controled commodities ఉన్నాయి. ఆ విషయం మీకు తెలిసిందే. సిమెంటు, పంచదార, iron & steel వగైరాలు. ఇవి రాష్ట్రంలో చాల కొరతగా ఉన్నవి. మనకు కావలసినంత రావడంలేదు. అందువల్ల సరఫరా పద్ధతులలో ఎన్నో లోపాలు జరుగుతున్నవి. కొంతమంది వీటినీ, black market లో అమ్ముతున్నారని అపనందలకు పాలుకావడం, ఈలాంటివి జరుగుతున్నాయి. దేశంలో ఉత్పత్తి ఎక్కువై, కావలసినంత సగకు ఉన్నప్పుడే, ఈలాంటి అవకతవకలు తగ్గిపోతవి. ఇవన్నీ మనకు చాలతక్కువగా దొరుకుతున్నాయి. కాబట్టి ఈపరిస్థితులలో మనం ఏమీ చెయ్యలేము. ఈలాగే కొంతకాలం సరఫరా చేసుకోకతప్పదు.

ఇక printing press వగైరాలు ఈ demand కు సంబంధించిందే అనుకుంటున్నాను. ఈ printing press వగైరాలు, రాష్ట్ర ప్రభుత్వానికి కావలసినంత కార్యక్రమాన్ని, పూర్తిచెయ్యడానికి, వీలు అయినవన్ని లేవు. అందువల్ల private press వారికి, వేతనాలు ఇచ్చి, tender ల ద్వారా పిలిచి, మన కార్యక్రమాన్ని పూర్తి చేయించుకుంటున్నాము. ఇదంతా మానివేసి మన press నే అభివృద్ధి చేసుకోవడానికి వీలు అవుతుంది. కాని, దానికొరకు, initial capital [illegible] [illegible]. [illegible] Education Department వారు కొన్ని, [illegible]

తరగతి text books అచ్చువేసి పంచిపెట్టడానికి ఆలోచిస్తున్నారు. ఈ పద్ధతులలో మన press ను, ఇంకా రెండంతలు, మూడంతలు, అభివృద్ధి చేసుకోవలసి ఉంటుంది. ఇప్పుడు వెంటనే అందుకు ప్రయత్నించడం చాల కష్టము, సాధ్యపడదు కూడ. కొద్ది కొద్దిగా అభివృద్ధి చేసుకోవడానికి మాత్రము వీలు అవుతుంది.

ఇక పరిశ్రమలలో మన రాష్ట్రం ఇంకా హెచ్చుగా ముందుకు పోవాలనే విషయము మీకందరకూ తెలిసిందే. హెచ్చుగా పరిశ్రమలు ఇక్కడ నెలకొల్పాలని చెప్పవచ్చు. Steel plant లు, ఇంకేవేవో కావాలని చెప్పవచ్చు. Madras లో "నైవేలీలో" బొగ్గు వస్తుందో, రాదో, తెలియదు. అలాంటి సందేహంగా ఉన్నచోట, కేంద్ర ప్రభుత్వంవారు 60 కోట్ల రూపాయలు ఖర్చుపెడుతుంటె, 6 కోట్ల రూపాయలు మాత్రమే, మనకు ఎందుకు ఇవ్వలేరని, అడగవొచ్చు. ఎన్ని ఏళ్ళగానో, సక్రమంగా, లాభసాటిగా జరుగుతున్న మన బొగ్గు గనులకు, అప్పు ఇవ్వకుండా, ఎక్కడనో, "నైవేలిలో" పాతాళలోకంలో ఉన్న బొగ్గు వస్తుందో రాదో, అలాంటి సందేహాస్పదంగా ఉన్నచోట్ల 60 కోట్లు ఖర్చుపెడుతున్నారే, అని చెప్పవొచ్చు. ఇది అంతా నిజమే. కాని, ఈ విషయాలు అన్నీ ఆలోచించిన తరువాతనే, చర్య తీసుకున్నదని, అనుకుంటున్నాను. అంతేగాక, ఏదో ఎరువుల factory కూడ, అక్కడనే, ఏర్పాటు చెయ్యడానికి నిశ్చయించుకున్నట్లు కనిపిస్తుంది. ఎందుకంటె అక్కడ ఉత్పత్తిఅయ్యే, bye-products, దానికి ఉపయోగించాలి కాబట్టి, అక్కడనే ఎరువుల factory పెడితే మంచిదని ఏర్పాటుచేశారు. అదేవిధంగా ఒక ఎరువుల ఫ్యాక్టరీ మన ఆంధ్రప్రాంతంలో, ఎక్కడైనా పెట్టి ఉంటే, లేక, కనీసం సరియైన సమయంలో, ఎరువులను మనకు సరఫరాచేస్తే, ఇప్పుడు ఉత్పత్తి అవుతున్న ధాన్యం కన్నా, ఒకటి, రెండు, బస్తాల ధాన్యం, ఎక్కువగా పండించటానికి వీలు అవుతుంది. ప్రతి ఎకరానికి, ఈ విధంగా, ఒకటి, రెండు, బస్తాల ధాన్యం, ఎక్కువగా పండితే, కనీసం 50 వేలో, లేక లక్ష టన్నులో, ధాన్యాన్ని ఆంధ్ర ప్రదేశ్‌లో, ఉత్పత్తి చెయ్యడానికి అవకాశాలు ఉన్నాయి.

కాని మన దురదృష్టం వల్ల, అది ఇక్కడ లేకపోవడం కారణంగా, మనకు కావలసిన ఎరువులు అన్నీ Bihar నుంచి, లేక ఇతరచోట్లనుంచి, తెప్పించుకోవలసి వస్తుంది. దాదాపు లక్షటన్నుల ఎరువులను, ఆంధ్రప్రదేశానికి ఇస్తూనే ఉన్నారు. కాని సకాలంలో రావడంలేదు. June, July, August నెలల్లో కావలసిన ఎరువులు, ఎప్పుడో, November, December లో వస్తున్నాయి. మనకు దగ్గిరగా, factory లేనందువల్ల, ఎక్కువ దూరంనుంచి రావాలి కాబట్టి, కొన్ని కొన్ని, ఇబ్బందులు కలుగుతున్నాయి. ఇందులో కేంద్ర ప్రభుత్వమువారు [illegible] చెయ్యగల్గిన సహాయము

చాలాతక్కువ. దీని విషయంలో ఎవరూ, ఏమీ చెయ్యలేరు. లక్షలాది ఎకరాలు సాగు అవుతున్న ప్రదేశందగ్గరలో ఒక ఎరువుల factory ని, ఏర్పాటు చేసుకోవాలి. Public sector లో కాకపోయినా, private sector లో ఎవరైనా సరే ఒక ఎరువుల factory ని ఏర్పాటు చెయ్యడానికి కృషిచెయ్యాలి. ఆలాంటి కృషిని ప్రభుత్వం గుర్తిస్తుంది. నిస్సందేహంగ, ఎవరి సహకారాన్ని అయినాసరే మనం కోరి, ఏలాగైనాసరే, దీనిని సాధించడానికి ప్రయత్నము చేస్తాము. దీనివల్ల ఆంధ్ర రాష్ట్రానికే గాక, మొత్తం భారతదేశంలో, ఎక్కడైతే, బియ్యం, ధాన్యం కొరత ఉన్నదో, అట్టిచోట, ఆ కొరతను తీర్చి, ఆ problem ను solve చెయ్యగలుగుతాము. కాబట్టి ఇక్కడ ఒక factory అవసరమనే విషయాన్ని, కేంద్రప్రభుత్వం వారికి చెప్పి, న్యాయమని అనిపించుకోవడానికి, ఎన్నో అవకాశాలు ఉన్నాయి.

ఇతరత్రా, ఎక్కువ పరిశ్రమలను అభివృద్ధి చెయ్యవచ్చు, కాని capital కావాలి. ఇప్పుడు మనకు ఉన్న ఆర్థిక పరిస్థితులలో హెచ్చుడబ్బును private కంపెనీలకు కానియ్యండి, లేదా ప్రభుత్వంద్వారా ప్రారంభించబడే పరిశ్రమలకు కానియ్యండి, ఖర్చుపెట్టే పరిస్థితులలో ఆంధ్రరాష్ట్రప్రభుత్వము లేదనే విషయం అందరకూ తెలుసును. మనశక్తికి మించి ఏ పనులూ చెయ్యలేము. శక్తికి లోబడే ఏవైనా చేసుకోవాలి. ఆశించినంత ముందుకు, ఉద్రిక్తంగా పోలేకపోయినా, ఉన్న పరిశ్రమలను, సక్రమంగా నడుపుకోవడంలో, అభివృద్ధిచేసే కార్యకలాపాలలో, నిమగ్నమై, ఈ industries department వారు చేస్తున్నకృషి అభినందనీయమైన విషయము.

కొత్తవి ప్రారంభించుకోవడం, చాల సులభం, కాని, చెడిపోయిన పాతవాటిని repair చేసుకోవడం మాత్రము చాలకష్టము. Repair చేసి సరియైన పద్ధతుల లోనికి తెచ్చుకోవడంలో, ఎన్నోకష్టాలు, ఎంతోమందికి బాధలు కలిగించవలసి వస్తుంది. ఎంతోమందికి అసంతృప్తినికూడ కలిగించవలసివస్తుంది. ఎలాగైనా సరే, బాధలు కలిగించి అయినాసరే, దేశ క్షేమ దృష్ట్యా, ఈ పరిశ్రమలను సరియైన పద్ధతులలో పెట్టడానికి కృషిచేస్తుంది. ప్రభుత్వ ప్రతినిధులైన nominated directors ద్వారా కానీయండి, లేదా, management లో మార్పువల్ల కానియ్యండి, లేదా, Board of directors లో కొత్తవారిని తీసుకురావడంవల్ల కానియ్యండి, ఏ పద్ధతులద్వారానో, ఇప్పుడు ఉన్న పరిశ్రమలను సరియైన పద్ధతులలో, నడిపించడానికి మాత్రం ప్రభుత్వము కృషిచేస్తుందని చెబుతున్నాను.

**అధ్యక్ష మహాశయా:** ఈ demand ను శాసనసభ్యులందరూ, అంగీకరించవలసిందిగా, కోరుచున్నాను.

*Demand XXIV—Industries—Rs. 1,66,97,800*

*Sri Vavilala Gopalakrishnayya (Sattenapalli): Sir, I beg to move:*

To reduce the allotment of Rs. 1,66,97,800 for Industries by Rs. 100

To start more industries

To reduce the allotment of Rs. 2,83,86,400 for Industries by Rs. 100

కుటీరపరిశ్రమలకు కేంద్రప్రభుత్వంనుండి రావలసిన విరాళాల సమయంలో సంపాదన పోగొట్టుకొంటున్న ప్రభుత్వ విధానాన్ని విమర్శించుటకు

To reduce the allotment of Rs. 2,83,86,400 for Indus tries by Rs. 100

To impress on the Government for starting a Fertiliser Factory in Andhra Pradesh.

*Sri M. Satyanarayana Raju (Cheepurupalli-General): Sir, I beg to move:*

To reduce the allotment of Rs. 1,66,97,800 for Industries by Rs. 100

For the failure of Government to bring all village artisans to work by organising Small Scale Industries.

*Sri Gopidi Ganga Reddy (Mudhole): Sir, I beg to move:*

To reduce the allotment of Rs. 1,66,97,800 for Industries by Rs. 100

నిర్మల్, ఇత్తడి పారిశ్రామిక సహకార సంఘమునకు యేవిధమైన ధన సహాయము యివ్వలేనందున

To reduce the allotment of Rs. 1,66,97,800 for Industries by Rs. 100

ప్రతి తాలూకాలో చేతి పనుల పరిశ్రమ ప్రభుత్వ కేంద్రములను స్థాపింపలేని అసమర్థతను గురించి

To reduce the allotment of Rs. 1,66,97,800 for Industries by Rs. 100

[illegible] [illegible] సహకార సంఘమునకు కావలసిన [illegible] కలుగజేయ [illegible]ందులకు

*Sri Baswa Maniah (Andole): Sir, I beg to move :*

To reduce the allotment of Rs. 1,66,97,800 for Industries by Rs. 100

జోగిపేటలో ప్రసిద్ధమైన, ప్రాచీనమైన చర్మపరిశ్రమ సొసైటీవారికి ఋణము యివ్వని ప్రభుత్వ విధానమును విమర్శించగలందులకు

To reduce the allotment of Rs. 1,66,97,800 for Industries by Rs. 100

ఎరువుల ఫ్యాక్టరీలు స్థాపించనందులకు

To reduce the allotment of Rs. 1,66,97,800 for Industries by Rs. 100

కుటీర పరిశ్రమల అభివృద్ధికై జిల్లాలలో తగు ప్రోత్సాహము, మరియు ఆర్థిక సహాయము చేయనందులకు

*Sri B. Sriramamurthy (Vizianagaram): Sir, I beg to move :*

To reduce the allotment of Rs. 1,66,97,800 for Industries by Rs. 100

To discuss the failure of the Government to nationalise the Bodhan Sugar Factory in which Government have 75% of shares.

To reduce the allotment of Rs. 1,66,97,800 for Industries by Rs. 100

To discuss the failure of the Government to take suitable steps for starting a Fertiliser Factory in the State.

To reduce the allotment of Rs. 1,66,97,800 for Industries by Rs. 100

To discuss the retrogressive measures of the Government in handing over Government concerns to private managements and the Government's failure to avoid the mismanagement in Industries.

*Sri K. L. Narsimha Rao (Yellandu-General): Sir, I beg to move :*

To reduce the allotment of Rs. 1,66,97,800 for Industries by Rs. 100

పరిశ్రమల నిర్వహణలో జరుగుతున్న అసమర్థత విధానాలనుగురించి, ప్రైవేట్ పరిశ్రమలలో పెట్టబడిన ప్రభుత్వ ధనం సద్వినియోగం జరుగునట్లు ప్రభుత్వ అజమాయిషీని ఏర్పర్చలేకపోవడం గురించి

To reduce the allotment of Rs. 1,66,97,800 for Industries by Rs. 100

కుటీర పరిశ్రమలకు తగిన ప్రోత్సాహం ఆచరణ రూపేణా యివ్వకపోవడం గురించి

*Sri Pillalamarri Venkateswarlu (Nandigama): Sir, I beg to move :*

To reduce the allotment of Rs. 1,66,97,800 for Industries by Rs. 100

For the failure of the Government to constitute non-official committees to go into the working of the Industries under Government management.

*Sri P. Satyanarayana (Samalkota): Sir, I beg to move :*

To reduce the allotment of Rs. 1,66,97,800 for Industries by Rs. 100

ప్రభుత్వం యొక్క పారిశ్రామిక విధానమును విమర్శించుటకు

*Sri S. V. K. Prasad (Chennur): Sir, I beg to move :*

To reduce the allotment of Rs. 1,66,97,800 for Industries by Rs. 100

ఆంధ్రప్రదేశ్‌లో ప్రభుత్వమునకు ప్రధానభాగం గల పరిశ్రమలను సక్రమంగా పనిచేయించి, వాటివల్ల లాభం వచ్చునట్లు చేయుటలో చాలవరకు విఫలమగుటను విమర్శించుటకు

To reduce the allotment of Rs. 1,66,97,800 for Industries by Rs. 100

ఆంధ్ర ప్రదేశ్‌లో పరిశ్రమాభివృద్ధికై సక్రమచర్యలు తీసుకోకపోవటాన్ని విమర్శించుటకు

*Sri Krishnamachari (Sangareddy-General): Sir, I beg to move :*

To reduce the allotment of Rs. 1,66,97,800 for Industries by Rs. 100

కుటీర పరిశ్రమలకై ప్రభుత్వము ఇచ్చిన ఋణముల వివరములు తెలిసికొనుటకు.

*Demand XLIII-Capital Outlay on Industries Development*
*Rs.* 1,75,30,000

*Sri P. Satyanarayana : Sir, I beg to move :*

To reduce the allotment of Rs. 1,75,30,000 for Capital Outlay on Industrial development by Rs. 100

ప్రభుత్వ విధానము విమర్శించుటకు

*Sri Gopidi Ganga Reddy : Sir, I beg to move :*

To reduce the allotment of Rs. 1,75,30.000 for Capital Outlay on Industrial Development by Rs. 100

నిజామాబాదులో షుగర్ ఫ్యాక్టరీ సహకార సూత్రాలపై స్థాపించేకొరకు ఆలస్యము చేయుచున్నందుకు

*Sri Baswa Maniah : Sir, I beg to move :*

To reduce the allotment of Rs. 1,75, 30,000 for Capital Outlay on Industrial Development by Rs. 100

జోగిపేట చర్మ పరిశ్రమ సహకార సంఘమునకు సహాయపడ ప్రభుత్వం గుర్తించగలందులకు.

Mr. Speaker : All these cut motions are now before the House.

* పి. సత్యనారాయణ :- అధ్యక్షా, మనరాష్ట్రంలో వుండే పరిశ్రమలను ఒక్కొక్క దానిని తీసికొనేముందు కొన్ని ముఖ్యవిషయాలు ప్రభుత్వ దృష్టికి తీసుకు రావలసివుంది. మన రెండవ పంచవర్షప్రణాళిక రెండు సంవత్సరములు గడచి మూడవ సంవత్సరములో ప్రవేశించబోతున్నది. మొత్తము రెండవ ప్రణాళికకుగాను 4 వేల కోట్ల రూపాయలు మన భారతదేశంలో పెట్టుబడిపెట్టడం జరిగింది. ఆహార ధాన్యాలు 30% అభివృద్ధి చెందినవి. పరిశ్రమలు 40% అభివృద్ధి చెందినవి. ఒకకోటి

డెబ్బది లక్షల ఎకరాలు క్రొత్తగా సాగులోనికి వచ్చినవి. ఈ విధంగా అభివృద్ధి చెందుతున్నా ఎందుచేత యీవేళ మన భారతదేశంలో ఒక రకమైనటువంటి పారిశ్రామిక క్లిష్టపరిస్థితి ఏర్పడింది? అనేక ఫ్యాక్టరీలు మూసివేయబడుతున్నాయి. బొంబాయి, అహమ్మదాబాద్, కాన్పూర్, చివరకు హైద్రాబాద్‌లోవున్న డి. బి. ఆర్. మిల్లులవంటి వాటిలో production తగ్గిపోయింది. Shifts తగ్గించివేస్తున్నారు. పనివారిని retrench చేస్తున్నారు. ఇక కుటీరపరిశ్రమల సంగతి చెప్పనక్కరలేదు. మొత్తముమీద నిరుద్యోగము బాగా పెరుగుతూన్నది. ఒకవైపు సంపద పెరుగుతున్నది, ఉత్పత్తీ పెరుగుతున్నది. వ్యవసాయ ఉత్పత్తికూడా పెరుగుతున్నది ఐతే యీపరిస్థితికి కారణమేమిటి? యీ సమస్యగురించి ముఖ్యమంత్రిగారు కించిత్తయినా ఉదహరించకపోవడము చాల విచారకరమైనటువంటి విషయము. పోనీ, ఆంధ్రప్రదేశ్‌లో ఉద్యోగ అవకాశాలను పెంచడానికి తగినటువంటి వనరులు బొత్తిగా లేకపోయినవా అంటే బొత్తిగా లేకపోలేదు. ఈవేళ Director of Controlled Commodities నుంచి రిపోర్టులు తెప్పించండి. ఎన్ని సినిమా హాలులు, ఎన్ని జిల్లాలలో, ఎన్ని తాలూకాలలో విపరీతంగా తయారౌతూ వున్నాయో గమనించండి. కొన్ని లక్షల రూపాయలు విలువచేసే బిల్డింగులలో భార్యభర్తల కంటె ఎక్కువమంది ఉండే కుటుంబాలు లేవు. అటువంటి పెద్ద బిల్డింగులమీద పెట్టుబడి పెట్టుతున్నారు. ఈ మధ్యనే ఒక మిత్రునిఇంటికి వివాహం సందర్భములో నేను వెళ్ళాను. అతను సామాన్యరైతు. 15 ఎకరాల మాగాణికంటె ఎక్కువభూమి లేదు. తనకోడలుకు 6,500 రూపాయల విలువగల diamond necklace తీసికొచ్చి పెట్టాడు. ఏమయ్యా నీకు పిచ్చిపట్టిందా అని అడిగితే, "ఏమి చేయమంటావయ్యా- అప్పుయిస్తే మారుటోరియమ్ వస్తుందేమో అని భయము, పరిశ్రమలు పెట్టడానికి మాకు చేతగాదు, భూములు కొందామా అంటే సీలింగ్ వస్తుందేమో అనే భయముంది. వస్తువులమీద వుంటే దానినెప్పుడైనా సొమ్ముచేసుకోవచ్చు" నన్నారు ఆయన. ముఖ్యంగా వ్యవసాయంలో అత్యంత అగ్రశ్రేణిలోవున్న మన రాష్ట్రంలో పరిశ్రమలను అభివృద్ధి చేసుకోడానికి వనరులు ఏర్పడడము లేదు. మనదేశంలో రిజర్వుబ్యాంకువాండ్లు issue చేసినడబ్బులో, demand, liabilitiesకు బాంకులో వున్నది 30% మాత్రమే. మిగతా 70% కూడా పైనవుండేటటువంటి డబ్బు. ఈ డబ్బంతాకూడా పరిశ్రమలను ప్లాన్ ప్రకారము అభివృద్ధి చేసుకోడానికి అవకాశము లేనటువంటిదిగా వుండి పోతుంది. అందువల్ల మొత్తముమీద నిరుపయోగంగా పడివున్నటువంటి నిధులు ఆంధ్రదేశంలో వున్నవి. వానిని ఎంతకాలము మనంతో planned economy అని పేరుపెట్టుకొని కాలక్షేపము చేస్తూ సమీకరించలేకుండా పోతున్నాము. ఇది ప్రధానమైనటువంటి సమస్య. Joint stock

Companies ఆంధ్రప్రదేశ్‌లో 1954-55 సంవత్సరంలో 570 రిజిస్టర్ ఐనవి. 1956-57లో అంటే రెండు సంవత్సరములు గడచినతర్వాత ఆ 570, 596 వరకు మాత్రమే పెరిగింది. కాని అదేకాలములో దివాలా తీసినవి కాని అనేక చిక్కులవల్ల కాని, వ్యాపారమాంద్యమువల్ల కాని మానివేసిన కంపెనీలు 31 వున్నాయి. అంటే actual గా పనిచేస్తున్నవి 565 మాత్రమే. 1954 లో 570 వుంటే 1956 వచ్చే టప్పటికి 565 మాత్రమే వున్నాయి. అంటే ఇంకా తగ్గినాయన్నమాట. National income చూచుకుంటే ఆంధ్రరాష్ట్రంలో పెరుగుతున్నది పరిశ్రమలుకూడా పెరుగుతున్నవి. ఆంధ్రరాష్ట్రంలో మొత్తము రెండవ పంచవర్ష ప్రణాళికకు మనము ఖర్చుపెట్టేటటువంటి డబ్బులో 7% కంటే ఎక్కువగా పరిశ్రమలకు కేటాయించలేదు. ఇండియా మొత్తముమీద 18. 5% యీ పరిశ్రమలకు ఖర్చుపెట్టబడుతున్నది. Industrial Finance Corporation ఉన్నది. క్రొత్త పరిశ్రమలు పెట్టినా, లేక వున్న పరిశ్రమలను విస్తరణచేసినా, ఇండియా మొత్తముమీద ఆ కార్పొరేషనువాళ్ళు అప్పులుయిస్తూ వుంటారు. వారు 1955 సంవత్సరంలో యిచ్చిన 28 కోట్ల రూపాయలలో మన ఆంధ్రప్రదేశ్‌కు వచ్చినటువంటిది 0 14% మాత్రమే. ఈవిధంగా ఆంధ్రప్రదేశ్ మొత్తముమీద పారిశ్రామిక దక్షత పెరగడము లేదు. వనరులు వున్నవి. కాని దక్షత పెరుగడము లేదు. ఈ సందర్భంలో ప్రభుత్వము యొక్క కర్తవ్యమేమిటి? నేను ఇంకొకటి మనవిచేయబోతున్నాను. ఈనాడు, ఇండియా గవర్నమెంటు అమెరికా మొదలైన దేశాలనుంచి తీసుకొనే అప్పుకు నూటికి 5¼ రూపాయలు వడ్డీయిచ్చి వందలాది కోట్ల రూపాయలు అప్పుతెచ్చుకుంటున్నది. కాని మనదేశంలో గ్రామాలలో డబ్బున్నవారిదగ్గరకెళ్ళి అప్పు అడిగినపుడు వారికి 3% లేక 4% కంటే "ఎక్కువ వడ్డీ ఇవ్వము" అంటున్నాము. ఉన్నటువంటి ద్రవ్యనిధిని ప్రభుత్వ plan ప్రకారము పరిశ్రమల అభివృద్ధి కొరకు వినియోగించుకోవాలంటే ఇది ఒక brake గా పనిచేస్తున్నది. పరిశ్రమలలో పెట్టుబడిపెట్టి వ్యాపారము చేయడమనే అలవాటు లేనటువంటి మనదేశంలో 6% యిచ్చి నిధుల నన్నిటినీ బయటికి తీసుకరావడానికి ఏవిధమైన అభ్యంతరమూ వుండదు. ఒకవేళ ప్రభుత్వమే 6% వడ్డీ యిచ్చినట్లయితే దానివల్ల చాల ప్రమాదాలుంటాయని చెప్పి జంకవచ్చును ఈ వేళ 2500 కోట్ల రూపాయలు ఇండియా గవర్నమెంటుకు కాని స్టేట్ గవర్నమెంటులకు కాని public debt వుంది. ఇది అంతా 3% లేక 4½%లోపునే వడ్డి వుంది. ఈవేళ అకస్మాత్తుగా 6% యిచ్చినట్లయితే ఏమౌతుందో అనే ప్రశ్నవస్తుంది. అది సబబే. కాని నేను మనవిచేసేది ఏమిటంటే ప్రభుత్వమే ఒక joint sector open చేయాలి. ఎటులైతే బోధన్ మొదలైనటువంటి ఫ్యాక్టరీలలో ప్రభుత్వము కొన్ని shares తీసుకొని ఒక joint sector పని

చెస్తున్నదో ఆవిధంగా విస్తృతము చేసినట్లయితే దర్వ్యనిధులన్ని కూడా బయటికి రావడానికి అవకాశాలుంటాయి మొదటి 5,6 సంవత్సరాలవరకు 6% గ్యారంటీగా యిస్తామనే పద్ధతిలో వ్యవహరిస్తే సులభంగా ఆంధ్రరాష్ట్రంలో 10 లేక 12 కోట్ల రూపాయలు సంపాదించడము సాధ్యమౌతుంది.

ప్రభుత్వమే 50% షేర్లను తీసుకోవాలి. ప్రవేటు షేర్లపై కూడా 6% వరకు వడ్డీ ఇస్తామని హామీ ఇవ్వాలి ఈ పనులు చేసి ప్రత్యేకంగా ఒక మంత్రి దీనికై బాధ్యత వహించి పని చేస్తే తప్పకుండా నిరుపయోగంగా ఉండే నిధులు ఉపయోగంలోనికి వస్తాయి. ఇంతేకాకుండా మనది వ్యవసాయక రాష్ట్రం కాబట్టి ప్రతివాడు తన దగ్గర నిలవఉన్న డబ్బును తన భూమిని అభివృద్ధి చేయడానికై తేనే పెట్టుబడిపెడతాడు తన భూమికి కాలువ తీసుకురావడానికి పెట్టుబడిపెడతాడు. కేవలం వ్యవసాయదృష్టి అది ; అందులోను తన భూమి తన ఆస్థి అని అనుకునే దృష్టి ఈ రకమైన మనస్తత్వం ఒకవైపు చాలా ఉన్నది. మరొకవైపు అతని దగ్గరే డబ్బు ఉన్నది. ఈ నిధులనుకూడా మనం కొంతవరకు tap చేయవలసి ఉన్నది. ఈ సమస్యనే Rural Credit Survey Committee వారు కూడా చాలా లోతుగా విచారణ చేశారు. చాలా కాలం క్రిందటనే ఒక చక్కని సూచన చేశారు. దీనిని పురస్కరించుకుని తూర్పుగోదావరి జిల్లాలో మేము చాలాకాలంనుంచి ప్రభుత్వం మీద వత్తిడి తీసుకువస్తున్నాము. కాని ఇంతవరకు పెడచెవిని పెట్టింది. ఒక ప్రాంతంలో ఉండే ప్రజల ఆర్థిక జీవితాలను తక్షణం అభివృద్ధి పరచగల పథకాలను కొన్ని తీసుకొని ఆ పథకాలను అమలుజరుపడానికి కావలసిన డబ్బును వాళ్ల దగ్గరనుంచే సేకరించడం. ఉదాహరణకు ఏలేరు ప్రాజెక్టు ఉన్నది. అక్కడ విపరీతమైన....

శ్రీ గోపిడి గంగారెడ్డి: పాయింట్ ఆఫ్ ఆర్డర్, సర్. తమలపాకులు వేసుకోవచ్చునా ?

మిస్టర్ స్పీకర్ : వేసుకో కూడదు ; ఎవరు వేసుకుంటున్నారు ?

శ్రీ గోపిడి గంగారెడ్డిగారు : ఆ అమ్మగారు.

మిస్టర్ స్పీకర్ : ఎవరైనా వేసుకుంటుంటే బైటకు వెళ్లి ఉమ్మి వేసుకు రండి. It is wrong. లేకపోతే ఎవరూ చూడకుండా ముందుగానే మ్రింగండి.

శ్రీమతి టి. లక్ష్మీకాంతమ్మ : ఎవరూ వేసుకోడంలేదు, వట్టి ఆరోపణలు చేస్తున్నారు.

శ్రీమతి టి. ఎన్. సదాలక్ష్మి : పొరపాటు మాట్లాడుతున్నారు ఇక్కడ ఎవరూ అటువంటిది చేయలేదు.

మిస్టర్ స్పీకర్ : ఫలానావారు అని చెప్పలేదు. కనుక విచారించవలసిన అవసరంలేదు.

శ్రీ పి. సత్యనారాయణ : ఏప్రాంతంలోనైతే పారిశ్రామిక అవకాశాలను కాని వ్యవసాయక అవసరాలను కాని విస్తృతం చేయడానికి మనం పథకాలు వేస్తామో, ఆ ప్రాంతంలో ఎక్కువ డబ్బును సేకరించడానికి అవకాశాలుంటాయి. కనుక ప్రభుత్వం float చేసే అప్పులను కాని తీసుకునే షేర్లను కాని ఆ పథకాలకు link up చేసి, ఒక reasonable period అయిదు సంవత్సరాలో, ఆరు సంవత్సరాలలో ఒక reasonable dividend, ఒక 6% guarantee చేస్తే ఈ నిధులన్నీ చక్కగా బైటకు వస్తాయని నేను మనవిచేస్తున్నాను. ఈపని చేయడానికి బదులు గత మూడు నాలుగు సంవత్సరాలనుంచి ప్రభుత్వం చేస్తున్న పని ఏమిటి ? గ్రామాలలో అక్కడక్కడ ఉంటున్న నిధులను బైటకు తీసుకురావడానికి బదులు ప్రభుత్వమే ఏడుకోట్లనుంచి 15 కోట్ల వరకు అప్పు ఇచ్చి భూస్వాములు ఆహారధాన్యాలలో స్పెక్యులేషన్ చేయడానికి సహాయంచేసింది. శుద్ధ వ్యతిరేకమైన పనిని చేసింది. దీనివల్ల మనరాష్ట్రమే కాకుండా మొత్తం భారతదేశంమీద రెండవ పంచవర్ష ప్రణాళికకు కొన్ని తూట్లుపడి మరల సవరించుకోవలసిన అవసరం వచ్చింది. పరిశ్రమల ద్వారా మాత్రమే పేదరికం సమస్యను పరిష్కారం చేసుకోగలమని ఇండియా ప్రభుత్వం మనమూ రెండవ పంచవర్ష ప్రణాళికాద్వారా బద్ధులమై (commit అయి) ఉన్నాము. అందుచేత అధికంగా పరిశ్రమలు అతిత్వరగా అభివృద్ధి పొందితేనే మొత్తం దేశమూ రాష్ట్రమూ ముందుకు వెడతాయి తప్ప మరొక విధంగా కాదు. ఇదివరకే రాష్ట్ర ఫైనాన్సు కార్పొరేషన్ పేరుతోనో State aid to industries పేరుతోనో, ఇంకా అనేక రూపాలుగా కొన్ని బ్యాంకులలో surity ఉంచే ప్రైవేటు పరిశ్రమదారులకు అప్పు ఇస్తున్నారు. ప్రైవేటు పరిశ్రమదారులకు అప్పులు ప్రభుత్వం యొక్క ప్రమేయం చాలావరకు ఇదివరకే ఉంటూనే ఉన్నది. అలాంటి సందర్భాలలో కేవలం అప్పు ఇచ్చి ఆ వడ్డీతో సంతృప్తి పడకుండా ఇదివరకు ఇచ్చిన అప్పులలో కొంతమేరకు ప్రభుత్వం షేరుగా భావించాలని మిగతాది అప్పుగా భావించాలనే పద్ధతిలో re adjust చేస్తే పరిశ్రమలలో ఒక రకమైన standard రావడానికి అవకాశం ఉంటుంది. అంతేగాక క్రమ క్రమంగా రాష్ట్ర బడ్జెటులో పరిశ్రమలద్వారా వచ్చే ఆదాయమే ఎక్కువ మొత్తంగా ఉండడానికి అవకాశం ఏర్పడుతుంది. ఇంతవరకు మనకు చాలా inelastic resources మాత్రమే ఉన్నాయి. ఈ విధంగా చేస్తే కొన్ని elastic resources కూడా ఏర్పడి

దేశప్రజలకు రాష్ట్ర ప్రజలకు కొన్ని మేళ్లు కలుగచేయడానికి ప్రభుత్వానికి అవకాశాలు ఏర్పడతాయి. ఆంధ్రరాష్ట్రంలో పారిశ్రామిక దక్షత చాలా తక్కువగా ఉన్నదనడానికి మరొక కారణం చెబుతాను మొన్ననే ఇచ్చిన రాష్ట్ర ఫైనాన్సు కమిటీ రిపోర్టు ఒకటి మా అందరి దగ్గర ఉన్నది. కార్పొరేషను వద్దకు అప్పుకోసము వచ్చే దరఖాస్తుదారులను అయిదు వర్గాలుగా విభజించారు; Public limited companies, Private limited companies, Sole proprietorships, Hindu joint family, Partnerships. వచ్చిన దరఖాస్తులలో అత్యధికమైన దరఖాస్తులు 5 వ తరగతినుంచి, అంటే పార్టనర్‌షిప్ కంపెనీల నుంచి, వచ్చాయి. అత్యధికంగా తిరస్కరించబడిన దరఖాస్తులుకూడా ఇందులోనుంచే తిరస్కరించబడ్డాయి. దీని అర్థం ఏమిటి ? చిన్న పార్టనర్‌షిప్స్‌లోని వ్యాపారస్తులందరూ కొంత పారిశ్రామికదక్షత వ్యాపారదక్షతతో వ్యాపారంలో ప్రవేశిస్తారు కాని వారికి stability తక్కువగా ఉంటుంది. ఇటువంటి వారి దరఖాస్తులను ఎక్కువగా తిరస్కరించారంటే వ్యాపార దక్షత ఉన్నవారి దరఖాస్తులను ఎక్కువగా తిరస్కరించారనే అర్థం. అయితే stability ఉండేవారు కావాలి మనకు. నిజమే. అటువంటి వారెవరున్నారు ? భూస్వాములున్నారు. ఒక రకంగా వీరు parasitic class. ఇంటి దగ్గర కూర్చుని కాలక్షేపం చేయడమో ఆహారధాన్యాలలో స్పెక్యులేషన్ చేయడమో అధిక వడ్డీలకు usury వ్యాపారం చేయడమో తప్ప వ్యాపారదక్షత వీరికి ఉండదు.

ఆంధ్ర రాష్ట్రములో ఇది ఒక క్లిష్టపరిస్థితిని తెచ్చిపెట్టింది. ఆంధ్రరాష్ట్ర పారిశ్రామికాభివృద్ధికి ఇది ఒక బాటిల్‌నెక్‌గా తయారైనది. దీనిని అధిగమించాలంటే ప్రభుత్వం జాయింట్ సెక్టార్‌లను విస్తృతపరచవలసి ఉన్నది. ఆవిధంగా చేస్తేనే గాని చిన్న పరిశ్రమలు అభివృద్ధి పొందవు. చిన్నపరిశ్రమలకు పెద్ద పరిశ్రమలకు విపరీతమైన పోటీ ఉంటుంది. ఒక సబ్బుల ఫాక్టరీ పెట్టాలంటే లక్స్‌వంటి ఆర్గనైజ్‌డ్ ఫ్యాక్టరీతో పోటీ ఉంటుంది. ఇటువంటి పరిస్థితులలో చిన్నపారిశ్రామికులు భయపడతారు. ఇట్టి సందర్భములలో ప్రభుత్వం వహించవలసిన పాత్ర కొంత ఉన్నది. ప్రభుత్వం తప్ప చిన్న పారిశ్రామికులకు ఆసరా ఇవ్వగలిగిన వారులేరు. ఈపరిస్థితుల దృష్ట్యా ప్రభుత్వం joint sector ను విస్తృతపరచవలసి వున్నది. అంతేకాక మన రాష్ట్రంలో క్రొత్త పరిశ్రమలు స్థాపించటానికి వున్న అవకాశములు చాలతక్కువ. ఈపరిశ్రమలకు కావలసినటువంటి, సాంకేతిక సహాయంగాని, మార్కెటింగ్, బ్యాంకింగ్, వసుపాయములు తగినంతగాలేవు. ఇవన్నీ అవరోధాలుగా ఉన్నాయి. ఒకపెద్ద దేశానికి, ఒక చిన్నదేశానికి మధ్య ఉండే పోటీ ఒకరు ఎక్కువ వస్తువులు తయారుచేయడంవల్ల ఇంకొకరు తక్కువగా తయారుచేయడంవల్లమాత్రమే

నిరూపించటం కష్టం. చిన్నపరిశ్రమలు దేశంలో అభివృద్ధి పొందాలంటే ప్రభుత్వం కూడా వాటికున్న అవరోధాలను తొలగించి ప్రత్యక్షంగా సహాయపడినప్పుడే అట్టి అభివృద్ధి సాధ్యమవుతుంది.

ఈనాడు నిరుద్యోగ సమస్య చాల తీవ్రంగావున్నది. ఇదివరకు ఈప్రాంతం నైజాం పరిపాలనలో ఉన్నప్పుడు లక్షలాది జనం షోలాపూర్, అహ్మదాబాద్‌లకు వలసపోతూ ఉండేవారు. నేను ఒక బాధ్యతగల వ్యక్తిని వాకబుచేయగా ఇప్పుడు కూడ జనం బొంబాయి రాష్ట్రానికి పోతున్నారని చెప్పారు. ఇది చాల దురదృష్ట కరమైన విషయం. ఇది మన ప్రభుత్వ పారిశ్రామిక విధానముపైన ఒక ప్రత్యక్ష విమర్శగావున్నది. మన రాష్ట్రంలో భారీ పరిశ్రమలను స్థాపించే విషయంలో ప్రభుత్వం విఫలమైనది. మన రాష్ట్రంలో వ్యవసాయం తరువాత చేనేతలో ఎక్కువమంది కార్మికులున్నారు. వీరందరికి ఉపాధులు కల్పించే నిమిత్తం తాత్కాలికంగా 5 ఏళ్ళపాటు అంటే 1961 వరకు కొంతసహాయం చేయుటకు డ్రాఫ్ట్‌ప్లాన్‌లో కొంత అవకాశం కల్పించటం జరిగింది. కాని ఈద్వితీయ పంచవర్ష ప్రణాళిక పార్లమెంట్‌కు వచ్చేసరికి ఇందుకు సంబంధించిన భాగం తొలగింపబడింది దీనికి సంబంధించినంతవరకు Cabinet మినిస్టర్స్‌లోనే తగాదావచ్చినట్లు విన్నాము. ఒక వైపున, శ్రీ టి టి. క్రిష్ణమాచారిగారు, ఇంకొకవైపున, నందాగారు, అభిప్రాయ బేధాలు వెలిబుచ్చినట్లు తెలిసింది. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ఆమోదింపబడిన 6 మాసాలకు "న్యూటెక్స్‌టైల్ పాలసీ" అని ఒకబిడ్డ బయటపడింది. మనకు ఉన్న పెద్ద ఆవరోధం ఫారిన్ ఎక్స్‌చేంజి. ప్రపంచ మార్కెట్‌కు మిల్లుగుడ్డలను ఎగుమతిచేయటం ద్వారా మనం ఫారిన్ ఎక్స్‌ఛేంజి ఇబ్బందులను అధిగమించవచ్చు. తద్వారా కొంత ఖర్చుతగ్గుతుంది అని శ్రీ T. T. క్రిష్ణమాచారిగారు చెప్పారు. ఈవాదనను తెలియజేశారు. ఇది చాలపొరపాటు అని చాలమంది పెద్దలు దీనిని వ్యతిరేకించారు. ప్రపంచ టెక్స్‌టైల్ మార్కెట్ కోసమని మన దేశంలోని మిల్లులను విస్తరింపచేశారు. చాల ఫారిన్ ఎక్చేంజి వినియోగించి పవర్ లూమ్స్‌ను మనదేశంలో ఏర్పాటుచేయటం జరిగింది, ఇందువల్ల ఈనాడు చాల మిల్లులలో సంక్షోభం ఏర్పడింది. ఈనాడు మిల్లులలో నిలువ ఉన్న బట్టను ఏమిచేయమంటారనే గగ్గోలు పుట్టినందువల్ల ఇటీవలనే మెహతాగారు, కొన్ని రకముల వస్త్రములపై ఎక్సైజ్ డ్యూటీని తగ్గించారు, ఎక్సైజ్ డ్యూటీస్‌వల్ల వచ్చే ఆదాయం పడిపోతున్నది. ఇన్‌కంటాక్సు ఆదాయం తగ్గింది అదేవిధంగా రాష్ట్రాలలో సేల్స్‌టాక్స్ ఆదాయం పడిపోయింది. మిల్లుగుడ్డలను ఇతర దేశాలకు ఎగుమతిచేసి ఫారిన్ ఎక్చేంజి సంపాదించగలమనే అభిప్రాయం పొరపాటని తేలిపోయింది. ఈనాడు దేశంలో నిరుపయోగంగా ఉన్న ఉత్పత్తిశక్తులను మానవశక్తిగానివ్వండి ప్రకృతిశక్తిగా

నివ్వండి. ప్రైవేటు సెక్టరు ఎంతవరకు అభివృద్ధి చెందాలి. నేషనల్ ఇన్‌కం కు, అవి ఎంతవరకు కంట్రిబ్యూట్ చేయగలవో అంతవరకు ఉపయోగించు కోవాలి. మన పారిశ్రామిక విధానాలను reshape చేసుకొంటేనేగాని ఈ crisis లో నుంచి బయటపడటానికి అవకాశముండదు. మన ముఖ్య మంత్రిగారు ముఖ్యంగా ఫర్టిలైజర్ ఫ్యాక్టరీ గురించి ఉదహరించారు. ఈఫ్యాక్టరీలో ఆంధ్రులే నింద్యార్హులని అనుకోవలసి వస్తున్నది. ఒకప్పుడు కృష్ణా, పెన్నార్ ప్రాజెక్ట్ నిర్మించవలెననే ప్రపోజల్‌కు కొందరు ఆంధ్రనాయకులు అంగీక రించగా ప్రజలు దానిని వ్యతిరేకించి ఒక ఉద్యమం నడిపారు. తత్ఫలితంగా వారు ఆ అభిప్రాయాన్ని మార్చుకొనవలసివచ్చింది. ప్రజలు అప్పుడు పట్టుదలతో వ్యవహ రించినందువల్ల ఈనాడు నాగార్జునసాగర్ నిర్మించటానికి అవకాశం చిక్కింది. ఈఫర్టి లైజర్ ఫ్యాక్టరీ విషయంలో కూడ ప్రజలు అప్రమత్తులై ఉన్నట్లయితే మనకేవిధమైన అన్యాయంజరిగి ఉండేది కాదు. 100 కి 8 వంతులు లాభంవచ్చి పని ప్రారంభించిన రెండు సంవత్సరములలోనే ఫలితాల నివ్వగల కొత్తగూడెం ఫర్టిలైజర్ ఫ్యాక్టరీని కాదని ఎప్పుడో 10 ఏళ్ళకుగాని అమలులోనికి రాని, 2% మాత్రమే లాభంవచ్చే నైవెల్లీ ఫ్యాక్టరీకి 60 కోట్ల రూపాయలు కేంద్రప్రభుత్వంవారు కేటాయిస్తూ ఉంటే మన రాష్ట్ర ప్రభుత్వం ఊరుకొన్నప్పటికీగూడ కొంతవరకు తమ హద్దులను కూడ పాటించకుండా కొంతమంది ప్రభుత్వోద్యోగులు- ముఖ్యంగా నేషనల్ లేబరేటరీ డైరెక్టర్ మొదలైనవారు, నేషనల్ ఇంటరెస్ట్ దృష్ట్యా ఈఫర్టిలైజర్ ఫ్యాక్టరీని కొత్తగూడెంలో ఏర్పాటుచేయవలెనని చెప్పారు. వారి హెచ్చరికలను గూడ పాటించ కుండా ఈఫ్యాక్టరీని మనం వదలుకోవడం జరిగింది. ఆంధ్ర ప్రభుత్వ శక్తి సామర్థ్యాలు మనకు తెలిసినవే. వారికి ఏదైనా పుంసత్వం వున్నట్లయితే దానిని ఇచ్చటి ప్రజలమీద ప్రతిపక్షాలమీద చూపిస్తారే కాని కేంద్రప్రభుత్వంతో పోట్లాడ టానికి వారికి దమ్ములున్నట్లు లేదు ఎక్కడో రూర్కేలాలో ఫర్టిలైజర్ ఫ్యాక్టరీ పెడతామన్నారు. అది 1961 వరకు తయారు కావటానికి అవకాశం లేదని కొన్ని రిపోర్టులు తెలియజేస్తున్నాయి.

నాంగల్‌లో పెడతామన్న ఫ్యాక్టరీ విషయంలో— ఫిబ్రవరి 1957 రిపోర్టు ప్రకారం చూస్తే—ఏవైపు మెషినరీ అమర్చాలనే విషయంలో - నిర్ణయానికి రాలేదని తెలుస్తోంది. నైవెల్లీ పరిస్థితి చూస్తే- అక్కడ underground conditions విషయం ఇదమిద్ధమని తేల్చుకోలేక పోతున్నారు. ఆర్టీషియన్ వాటర్ సమస్య ఉంటనే ఉన్నది. అది తేలినతరువాత మళ్లీ యిది తేలాలి. ఏదీ తేల్చుకోలేకుండా ఉన్నారు. ఇవి రెండూ తేలినతరువాతగాని ఫెర్టిలైజర్సు గొడవ రావేరాదు. దీని కంతటికీ ఎన్నాళ్లు పట్టుతుందో తెలియదు. ఇది తేలేలోపుగా 25 కోట్ల రూపాయలు

విదేశాలకు పంపవలసినదేనా ? ఇక్కడ రెండేండ్లలో 8 పర్ సెంట్ లాభం వచ్చే ఫ్యాక్టరీ నిర్మాణమునకు ఎందుకు ఒప్పుకొనుటలేదు ? Central Ministry of Commerce and Industry లో క్రిష్ణమాచారిగారున్నప్పుడు ఎంత ముష్కరంగా వారు సమాధానం చెప్పారంటే-టెక్నికల్ కారణాలవల్ల గాని, ఏ కారణాలవల్లనైనా సరే నైవెల్లీకి పోతే పోవచ్చునుగాని బెజవాడకు మాత్రం, రాదనిచెప్పారు. దానిని బట్టి, అసలు కాబినెట్ మినిష్టరుగా ఉండేవారి మనస్తత్వం బాగా బోధపడుతుంది. తరువాత ఈ ఫెర్టిలైజరు ఫ్యాక్టరీస్‌కు సంబంధించి ఒక ఎంక్వైరీ కమిటీ వచ్చింది. ఈ కమిటీవారు ఎంత చక్కగా వ్రాసినారంటే నైవెల్లీలో ఉండే బలహీనతలు వ్రాశారు. బెజవాడ యొక్క యోగ్యతలు ఒప్పుకొన్నారు. ఒప్పుకొనికూడా నైవెల్లీలో ప్రయత్నము చేయవలసినదని, చేయగా చేయగా కొంతకాలమునకు అక్కడ నిరుపయోగమని తేలినతరువాత మాత్రమే బెజవాడను గురించి ఆలోచించా లన్నారు. మొత్తంమీద కేంద్రప్రభుత్వ మంత్రివర్గ స్థాయిలో ఉండే పలుకుబడులు చివరకు యిలాంటి సబ్‌కమిటీస్ మీదకూడ పనిచేసి ఎంత అవకతవక రిపోర్ట్సు బయటపడుతున్నాయో చూడవలెనని కోరుతున్నాను. ఈ పరిస్థితులలో మన ప్రభుత్వం ఏమిచేసింది ? ప్రజలు ఋణాలుయిస్తే ఫ్యాక్టరీస్ పెడతామని "బదుళ్ళు మీరిస్తారా, మీరిస్తారా' అని ప్రభుత్వం భిక్షాటన చేస్తోంది. అది ఎంతమాత్రం సమర్థనీయంగా జరిగేదికాదు. నా ప్రతిపాదన ఏమంటే—రేపే ఒక కంపెనీని రిజిష్టరు చేసి ప్రభుత్వం తరపున 50% share capital promise చేసి వెంటనే పని ప్రారంభిస్తే, అప్పుడు కొత్తవాతావరణం ఏర్పడుతుంది. 6% డివిడెండు 6 సంవత్సరముల పాటు గ్యారంటీ యిస్తే, ఒక్క సంవత్సరంలో share capital వస్తుంది. వచ్చే సంవత్సరం ఫ్యాక్టరీపని ప్రారంభం అవుతుంది. 1960 నాటికి మార్కెటుకు ఫెర్టిలైజర్సు వస్తాయి సందేహం లేదు ఇప్పుడు మాట్లాడుతూ చీఫ్ మినిష్టరుగారు ఫెర్టిలైజరు విషయంలో కేంద్రప్రభుత్వాన్ని సమర్థించారు. ఆ సమర్థనను మేము ఎంతమాత్రమూ బలపరచలేక పోతున్నాము. ఏదైనా మన రాష్ట్రప్రభుత్వం తరపున కేంద్రంతో దెబ్బలాడితేనే మనకుకొంత లాభం ఉంటుందని మనవి చేస్తున్నాను.

కోల్ విషయంలో చీఫ్‌మినిష్టరుగారు చెప్పిన విషయాలను బలపరుస్తున్నాము. ఈనాడు కేంద్రప్రభుత్వం ఆంధ్రరాష్ట్రంపట్ల ఎలా, సవతితల్లిగా ప్రవర్తిస్తున్నదో - షుగర్, ఫెర్టిలైజర్, కోల్-యీ మూడు విషయాలలో స్పష్టంగా కనపడుతోంది. కోల్ విషయంలో అప్పు అడిగితే కేంద్రప్రభుత్వం యివ్వలేదు. Sugar factories విషయంలో foreign exchange లేకుండా చేశారు. ఫెర్టిలైజర్ విషయంలో ఆ అన్యాయం చేసింది. కనుక కేంద్రప్రభుత్వంతో గట్టిగా పోట్లాడి కోల్‌కు కావలసిన అప్పు మన రాష్ట్రప్రభుత్వం సంపాదించాలని మనవిచేస్తున్నాను. ముఖ్యంగా

మన రాష్ట్రంలో చక్కెర విస్తరణకు చాలా అవకాశాలు ఉన్నాయి. కేవలం కో-ఆపరేటివ్ రంగంలో మనం వాగ్దానం చేసిన 5 మిల్సుకూడా స్థాపించడానికి అవకాశం లేకపోతే State participation తో joint sector లో స్థాపించడానికి (కోఆపరేటివ్ రంగంలోకంటె) ఎక్కువ అవకాశాలున్నాయని మనవిచేస్తున్నాను.

షుగర్ ఫాక్టరీస్‌లో మొలాసెస్ (molasses) విషయం ఒక పెద్ద సమస్యగా ఉన్నది. షుమారు 50 వేల టన్నులవరకు (యిప్పుడు సరైన అంకెలులేవు) waste అయినది. కొంత ఎగుమతి చేస్తున్నారు బోధన్ ఫ్యాక్టరీ అంకెలు తీసుకుంటే, ఎగుమతి వల్లవచ్చే ఆదాయముకంటె, దానిని మరొకవిధంగా మళ్లిస్తే యింకా చాలా ఆదాయం వచ్చేటట్లు కనపడుతుంది. బోధన్‌ఫ్యాక్టరీ వారితో మాట్లాడాను. మొలాసెస్ నుంచి పవర్ ఆల్కహాల్ తయారు చేయవచ్చును అటువంటి ఫ్యాక్టరీ ప్రభుత్వ సెక్టార్‌లో ఉన్నది. దానిమీద పోయిన సంవత్సరం 18 పర్‌సెంట్ లాభము వచ్చినది. ఏ పరిశ్రమలలోనూ యింత లాభం రాలేదు. ఈ పవర్ ఆల్కహాల్ తయారు చేస్తే ఫారిన్ఎక్స్‌ఛేంజి చాలా మిగులుతుంది. ఇప్పుడు సర్కార్స్‌లో ఉండే షుగర్ ఫాక్టరీస్‌కు సెంటరు సామర్లకోటలో (ఇదివరకే ప్యారికంపెనీకి పవర్ ఆల్కహాల్ ఫాక్టరీ ఉన్నది) అది పునరుద్ధరించి ఎక్స్‌టెండ్ చేసి, చుట్టుపట్ల అన్ని ఫ్యాక్టరీస్‌నుంచి అక్కడకు మొలాసెస్ తెప్పించి పవర్ ఆల్కహాల్ తయారుచేయిస్తే చాలా లాభం వస్తుందని మనవి చేస్తున్నాను.

పొగాకు ఉన్నది. దీనికి చైనాతో, జపాన్‌తో ట్రెడిషనల్ మార్కెట్స్ ఏర్పాటు చేయడానికి అవకాశాలు ఉన్నాయి. ఆ దేశాలనుంచి ఇద్దరు ప్రతినిధులను పిలిపించి ఆంధ్రప్రదేశంలోని పొగాకు పరిస్థితి పరిశీలించి వారి సలహాలు తీసుకొని ఆ దేశాలతో మార్కెట్ డెవలప్ చేసుకుంటే ఆంధ్రప్రదేశ్‌కు ఆర్థికంగా లాభించే అవకాశాలున్నాయి.

మాంగనీస్ విషయంలో ట్రాన్స్‌పోర్టు—రైల్వే అండ్ షిప్పింగ్—ఈ రెండూ మైన్ బాటిల్-నెక్సుగా ఉన్నాయి. జపాన్, యితర దేశాలకంటె మన మాంగనీస్‌కు ఎక్కువ ప్రాముఖ్యతనిచ్చి, కొంటుంది. ఈ రైల్వే, షిప్పింగ్ వ్యవహారం ప్రైవేట్ ఫరమ్సుకు విడిచి పెట్టకుండా స్టేట్‌లెవెల్‌లో ప్రభుత్వం బాధ్యత తీసుకొని చేయాలి.

మైకా విషయంలో నిరుద్యోగ సమస్య యిటీవల బాగా వ్యాపించింది. దీనికి ప్రభుత్వ స్థాయిలో చేస్తున్న ప్రయత్న లోపము తప్ప యింకేమీ లేదు. దీనిని భారీ ఎత్తున జపాన్ ఎగుమతి చేసుకుంటుంది. దీనితో వారి ఎలెక్ట్రికల్ గుడ్సు ఎక్స్

పాన్షన్ విషయంలో ఎక్కువ ప్లాన్సు వేసుకొన్నారు. మైకా విషయంలోకూడా స్టేట్ లెవెల్‌లో కృషి చెయ్యాలని కోరుతున్నాను

ఐరన్ ఓర్ విషయంలో, పిట్ వద్ద టన్ను ఖరీదు రు 8 అయితే, బళ్ళారి నుంచి వైజాగ్ ఒచ్చేసరికి రు. 24లు రైల్వే చార్జీలు అవుతున్నాయి. ఈ వ్యాపారం అభివృద్ధి చెందాలంటే రైల్వే వాగన్స్‌సప్లయిలో చిక్కులను తొలగించాలి. దీనికి కావలసినది ఓపెన్ వాగన్సు కాబట్టి ఎక్కువ కష్టము ఉండదు. వీటి సప్లయి చురుకుగా చేయించాలి.

స్టీల్ ప్లాంట్ విషయంలో, మొన్నటివరకు ఆంధ్రరాష్ట్రానికి గవర్నరుగా ఉన్న త్రివేదీగారు. యిక్కడనుంచి వెళ్ళిపోయేముందు, మూడవ ప్రణాళికలో ఆంధ్రరాష్ట్రానికి ఒక స్టీల్ ప్లాంట్ రావడానికి అవకాశం ఉన్నట్లు సూచన చేసి వెళ్ళారు. కాని నిన్న, మొన్న పత్రికలలో చూస్తే, బొకారు అన్న చోటకు (రాష్ట్రం పేరు ఏమిటో తెలియదు) నాల్గవ స్టీల్ ప్లాంట్ ఆంధ్రరాష్ట్రానికి రాకుండా పోతున్నట్లు తెలుస్తున్నది. ఇతర రాష్ట్రాలలో ఉన్న ఐరన్ ఓర్ కంటే, ఆంధ్ర రాష్ట్రంలోది హైగ్రేడ్ క్వాలిటీ. రీజినల్ ప్లాన్సు దృష్ట్యాకూడా స్టీల్ ప్లాంటును యిక్కడికి తెప్పించుకొనేట్లు గట్టిగా ప్రయత్నం చేయవలసియున్నది.

ప్రాగా టూల్సు విషయంలో, వారికి స్టీల్ సప్లై లేకపోవడం వల్ల, అక్కడ పని కొంత మూల పడింది. 25 పర్సెంట్ తక్కువ వర్కు లోడు తో పని చేస్తున్నారని విన్నాను.

* శ్రీ కె. సీతయ్యగుప్త (ముషీరాబాద్) :- అధ్యక్షా, ముఖ్యమంత్రిగారు ప్రవేశపెట్టిన యీ డిమాండ్‌ను నేను బలపరుస్తూ కొన్ని సూచనలు చేస్తున్నాను. మన దేశం 80 వంతులు ఎగ్రికల్చర్‌పైన ఆధారపడిఉంది. మనయొక్క పాప్యులేషన్ వృద్ధి అవుతూన్న కొలది, మనం లాండ్‌పైన ఆధారపడితే లాభం లేదు. మన దేశం అభివృద్ధి కావాలంటే, మనం ఇండస్ట్రీస్‌ను ప్రోత్సహించి, ముందుకు తీసుకుపోయే ప్రయత్నం చేయవలసిఉన్నది. ముఖ్యంగా ఇప్పుడు లైసెన్సు ఇస్తున్న పద్ధతులు చూస్తే, దీనిలో చాలా ఆలస్యం జరుగుతున్నది. 18 నెలలు అయినా, లైసెన్సు ఇవ్వటం లేదు. ఈవిధంగా లైసెన్సు ఇవ్వడమైతే, ఇండస్ట్రీస్ ఏవిధంగా అభివృద్ధి చెందుతాయో ఆలోచించవలసిఉంది. ఏ ఇండస్ట్రీఅయినా, డబ్బు కావాలని అప్లికేషన్ పెట్టుకొంటే, ఫైనాన్స్ కార్పొరేషన్, స్టేట్‌బ్యాంక్, ఇండస్ట్రీస్ డిపార్టు

మెంట్ ద్వారా దానికి డబ్బు ఇచ్చే పద్ధతి ఉంది. ఫైనాన్స్ డిపార్ట్‌మెంట్ కొంత డబ్బు ఇస్తుంది. ఆ డబ్బు సరిపోదు. ఇండస్ట్రీస్ డిపార్టుమెంటుకు డబ్బు కావాలని అప్లికేషన్ పెట్టుకొంటే "ఇదివరకు మీరు ఫైనాన్స్ కార్పొరేషన్ నుండి డబ్బు తీసుకొన్నారు కాబట్టి, ఇప్పుడు తిరిగి మీకు డబ్బు ఇవ్వటానికి వీలులేదు." అని ఆ డిపార్టుమెంట్‌వారు సెలవిస్తున్నారు. ఫైనాన్స్ కార్పొరేషన్, స్టేట్ బ్యాంక్, ఇండస్ట్రియల్ డిపార్టుమెంట్‌లను కోఆర్డినేట్ చేసి, వచ్చిన అప్లికేషన్స్ అందరు కలిసి పరిశీలించి, ఇండస్ట్రీస్‌కు డబ్బు ఇస్తే బాగుంటుంది. ఆవిధంగా చేయవలసిందిగా నేను మంత్రిగారికి సూచిస్తున్నాను. రిజర్వ్‌బ్యాంక్ నాలుగున్నర పర్సెంటు ఇంటరెస్ట్‌పైన డబ్బు ఇస్తున్నది. మనం ఇండస్ట్రీస్‌ను ఎక్కువ చేయాలని అనుకొంటున్నాము. వాటికి డబ్బు చాలా తక్కువ ఇంటరెస్ట్‌పైన ఇవ్వవలసిఉన్నది. ఒక పర్సెంట్, అర పర్సెంటు ఇంటరెస్ట్ తీసుకొని, ఇండస్ట్రీస్‌కు డబ్బు ఇవ్వాలని కోరుతున్నాము. ఇప్పుడు ఇండస్ట్రీస్‌కు 6 పర్సెంట్ వడ్డీ తీసుకొని డబ్బు ఇస్తున్నారు. అలాకాకుండా చాలా తక్కువ వడ్డీ తీసుకోవాలని నా అభిప్రాయము.

చిన్న చిన్న పరిశ్రమలు ఉత్పత్తి చేసిన సరుకుకు మనదగ్గర సరైన మార్కెట్ లేదు. దీనినిగురించి 1931వ సంవత్సరంలో రాయల్ కమీషన్ ఒక సజెషన్ ఇచ్చింది. అది ఇప్పుడు ఏమాత్రం పాటించబడటం లేదు. చిన్న తరగతి పరిశ్రమలు తయారు చేసిన సరుకుకు సరైన మార్కెటింగ్ సౌకర్యాలు మనం కలిగించనంతవరకు, ఆ పరిశ్రమలు అభివృద్ధి కావు. అంతవరకు ఆ పరిశ్రమలవల్ల లాభం లేదు.

పరిశ్రమల మంత్రి (శ్రీ ఎ. భగవంతరావు): ఆ కమీషన్‌వారు మార్కెటింగ్ ప్రాబ్లెమ్ గురించి ఇచ్చిన సలహా ఏమిటో చెబుతారా ?

శ్రీ కె. సీతయ్యగుప్త : 1931వ సంవత్సరంలో వారు సలహా ఇచ్చారు.

శ్రీ ఎ. భగవంతరావు : ఆ సలహా ఏమిటి ?

శ్రీ కె. సీతయ్యగుప్త :- 1931 వ సంవత్సరంలో మార్కెటింగ్‌కు సంబంధించి కొన్ని సలహాలు ఇస్తూ, ఒక రిపోర్టు ఇచ్చారు. మంత్రిగారు ఆ రిపోర్టు చదువుకొని చూస్తే తెలుస్తుంది. ఈ పరిశ్రమలు తయారుచేసిన సరుకులకు మార్కెటింగ్ సౌకర్యాలు లేకపోతే, ఆ పరిశ్రమలకొరకు మనం ఖర్చుపెట్టిన డబ్బుకు లాభం ఉండదని నేను సూచిస్తున్నాను. ఎస్టాబ్లిష్‌మెంట్ ఆఫ్ ఇండస్ట్రియల్

ఎస్టేట్స్ అని ఏర్పాటుచేశారు. ఆంధ్రలో రెండు మూడు ఉన్నవి. తెలంగాణా ప్రాంతంలోని రామగుండంలోకూడ ఒకటి ఏర్పాటుచేస్తే బాగుంటుందని మనవి చేస్తున్నాను.

మైసూరు, మద్రాసు వగైరా రాష్ట్రాలలో యూనిట్‌కు ఒక అణా ఎలక్ట్రిసిటీ రేటు ఉన్నది. ఇక్కడ అణన్నర ఉన్నది. ఈ రేటు తగ్గించమని అంటే "మాకు లాస్ వస్తుందని" ప్రభుత్వం అనవచ్చును. చిన్నచిన్న పరిశ్రమలకు సప్లయిచేస్తున్న ఎలక్ట్రిసిటీ రేట్ తక్కువచేస్తే, 50 వేల రూపాయలు నష్టము వస్తే రావచ్చును. అందువల్ల మనకు వచ్చిన లోటు ఎక్కువలేదు. దాని విషయంకూడ ప్రభుత్వం పరిశీలించవలసిందిగా కోరుతున్నాను. మన దగ్గర టెక్నికల్ హేండ్స్ లేరు, ఇంజనీర్స్ లేరు, అని పదేపదే మన చీఫ్‌మినిష్టర్‌గారు సెలవిస్తున్నారు. కాని వారి కొరత తీర్చడానికి ఏవైనా స్కీములు తయారుచేశారా అన్నది ఆలోచిస్తే, అటువంటి వేమీ కనుపించడంలేదు. కాబట్టి మనం టెక్నికల్‌హేండ్స్, ఇంజనీర్స్‌ను ఎక్కువ చేయటం కొరకు, ఇప్పుడే ఒక ప్లాన్‌వేసి అమలు జరుపుకోవలసిఉన్నది. ఆవిధంగా ఇప్పుడే ఒక ప్లాన్‌వేసి, అమలు జరుపుకొంటే, వచ్చే మూడు సంవత్సరాలలో మనకు టెక్నికల్‌హేండ్స్, ఇంజనీర్స్ కొరత లేకుండా చేసే అవకాశం ఉంటుంది. అట్లా చేయకపోతే, ఇంకా పది సంవత్సరాలైనా, మనకు టెక్నికల్‌హేండ్స్, ఇంజనీర్స్ కొరత ఉంటూనే ఉంటుంది. టెక్నికల్‌హేండ్స్ ఇంజనీర్స్ కొరత మనం పది సంవత్సరాలు గడిచినా తీర్చలేము. ఇది చాలా ముఖ్యమైన విషయము. దీనిని బాగా ఆలోచించి. టెక్నికల్‌హేండ్స్, ఇంజనీర్స్ కొరత లేకుండా చేయటానికి తొందరగా ప్రయత్నించగలరని ఆశిస్తున్నాను.

ఇంకో విషయం ఏమిటంటే, - ఆంధ్రాలో డైరెక్టర్ డిపార్టుమెంటువారు 5 వేల రూపాయల వరకు ఇస్తారు. తెలంగాణాలో మూడువేల రూపాయలు మాత్రమే ఇస్తారు. సేల్స్‌టాక్స్ మొదలగు ఆదాయం వచ్చే బిల్లులను ఇంటిగ్రేట్ చేయటానికి తొందర పడుతున్నాము. మన ఆంధ్రప్రదేశ్‌లో ఇండస్ట్రీస్ వృద్ధిచేయా లనే ఉద్దేశ్యం ఉంటే, దీనినికూడ తొందరగా ఇంటిగ్రేట్ చేస్తే, చిన్న పరిశ్రమలకు లాభం ఉంటుంది. కాబట్టి, దీనివిషయంలో మినిష్టర్‌గారు తొందరగా ఒక నిర్ణయానికి రావాలని మనవిచేస్తున్నాను.

చిన్నపరిశ్రమలకుగాని, పెద్ద పరిశ్రమలకుగాని Financial Corporation వారు డబ్బు తొందరలో ఇవ్వడములేదు. Financial Corporation లోని

capital మొత్తము సుమారు రెండుకోట్లు ఉన్నట్లు కనబడుతున్నది. కాని అసలు actual గా యిచ్చినది నలభై లక్షలనే లెక్కలవల్ల తేలుతున్నది. ఇదివరకు హైదరాబాదు ప్రభుత్వమువారు 34 లక్షలు ఇచ్చినట్లును, ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత ఆరులక్షలు యిచ్చినట్లును తెలుస్తున్నది. అయితే రెండుకోట్ల రూపాయలు కార్పొరేషనుకు ఏ విధముగ యివ్వాలని ప్రభుత్వము అనుకుంటున్నది ? ఈవిషయము ప్రభుత్వము ఆలోచించిందా ? ప్రభుత్వము యివ్వదలచిన రెండుకోట్ల రూపాయలు త్వరలో యిస్తే, industries ను అభివృద్ధి చేయటానికి అవకాశముంటుంది.

ఆంధ్రలో ఉన్న paper mills ను గురించి నేను పరిశీలించి చూచాను. ఇందులో ఇంతవరకు యాభై లక్షలు పెట్టుబడి పెట్టినట్లు తెలుస్తున్నది. ఇంకా 20 లక్షలు అదనముగ పెట్టుబడి పెట్టదలచినట్లు తెలుస్తున్నది. ఇంతవరకు పెట్టిన పెట్టుబడి మీద రు 53,164-13-2 లు లాభము వచ్చినట్లుగా లెక్కలవల్ల తెలుస్తున్నది. ఈలాభము పెట్టుబడిమీద ఒక్క పరసెంటు మాత్రమే వచ్చినట్లు తేలుతున్నది. ఇది ఏమంత పెద్దలాభముకానేరదు. 70 లక్షలు పెట్టుబడిపెట్టి యింత స్వల్ప ఆదాయము సంపాదించడములో విశేషమేమీకన్పించదు గనుక, యింత స్వల్పలాభము తెచ్చు కునేబదులు Low Income Groupకు చెందిన ప్రజానీకము ఇళ్ళులేక యిబ్బంది పడుతున్నారు. ఈ 70 లక్షలు వారికి యిళ్ళుకట్టించటానికి invest చేస్తే, కనీసము 4½ %ఆదాయము రావటానికి వీలుఅవుతుంది. నా ఉద్దేశ్యములో Paper mills మీద యింకా ఎక్కువ సొమ్ము invest చేసే బదులు దానితో Low Income groups వారికి యిళ్ళుకట్టించడమే ఎక్కువ లాభదాయకమని అనుకుంటున్నాను. ప్రభుత్వము యీవిషయమును గురించి ఆలోచిస్తే మంచిది.

తరువాత గూడూరులో గ్లాసు ఫ్యాక్టరీ ఒకటి నడపబడుతున్నది. దాని యొక్క లెక్కలు కూడ చూచాను. దానిమీద రెండులక్షల పద్దెనిమిదివేలు పెట్టుబడి పెట్టబడింది. ఇప్పుడు దానికి అదనముగ పెట్టుబడి పెట్టటానికి మూడులక్షల రూపాయలు కేటాయించారు. ఈగ్లాసు ఫ్యాక్టరీమూలంగా రు 39, 311-14-5 లు నష్టము వచ్చినట్లుగా లెక్కలు చూపిస్తున్నవి. ఇంత నష్టముమీద యీ factory ని నడిపించేబదులు, దీనిని యింతటితో ఆపివేసి, యింకా ఏవైనా లాభకరముగ ఉండే పరిశ్రమలమీద invest చేస్తే మంచిదిగాని నష్టముమీద యీ industry ని నడిపించితే మాత్రము ప్రయోజనము ఏమిటి అని అడుగుతున్నాను. ఇంక ఎన్నో విషయములు ప్రభుత్వము దృష్టికి తేవలసినవి ఉన్నవి. అధ్యక్షులవారు టైము

అయిపోయిందని అంటున్నారు గనుక, ఇంతటితో విరమిస్తున్నాను. ఇంతవరకు నాకు అవకాశమిచ్చినందులకు నాహృదయపూర్వకమైన అభివందనములు వారికిసమర్పిస్తున్నాను.

శ్రీమతి వై. సీతాకుమారి (భాన్సువాడ): అధ్యక్షా, ముఖ్యమంత్రిగారు యీదినమున ప్రవేశపెట్టిన పరిశ్రమలకు సంబంధించిన డిమాండును నేను బలపరుస్తూ కొన్ని ముఖ్యమైన విషయములు వారిదృష్టికి తెస్తున్నాను. గడచిన సంవత్సరము బడ్జటు సమావేశములో యీపరిశ్రమలను గురించి చర్చించినప్పుడు సభ్యులు ఎంతో ఉద్రేకమును కనబరచి, కొన్నిసూచనలు చేశారు. అందులో ముఖ్యంగా నిజాం చక్కెర ఫ్యాక్టరీని గురించి, Alwin Metal Works ను గురించి ఎన్నోలోపాలు ఉన్నవని చెప్పారు. ఆలోపాలు అన్నీ చాలమటుకు సవరించబడినవని ముఖ్యమంత్రి గారు తన ఉపన్యాసములో యీడిమాండును ప్రతిపాదిస్తూ చెప్పారు. ఆ లోపాలను సవరింపజేయటములో వారు ఎక్కువకృషిచేస్తున్నారని తెలిసినందుకు, యీడిమాండును నేను సంతోషముతో బలపరుస్తున్నాను. వాటిలో యీసంవత్సరము నలభై లక్షలు లాభము మాత్రమే వస్తున్నదని, యింకా అభివృద్ధిపరచటానికని ఒక Special Officer ను వేశామని అన్నారు. Special Officer యొక్క అజ్మాయిషీ క్రింద 60 లక్షలదాకా లాభము రావటానికి అవకాశము ఉన్నదని చెప్పారు గనుక నాకెంతో సంతోషముగ నున్నది. ఆపరిశ్రమలలో యింకా ఏవైనా చిన్నచిన్న లోపాలు ఉంటే అవిఅన్నీ సవరిస్తారని ఆశిస్తున్నాను. ఇంతవరకు లోపములు సవరించినందుకు అక్కడి ప్రజల తరపున నాసంతోషమును వెల్లడిచేస్తున్నాను. తరువాత అక్కడ ఉన్న కార్మికులకు సంబంధించినవి అనేకవిషయములు ఉన్నవి. వాళ్లకు బోనసు యిప్పటికి మూడు సంవత్సరములుగా యివ్వలేదని complaint ఉన్నది. దీనివల్ల వాళ్లు చాలా ఆవేదన, యిబ్బందులు పడుతున్నట్లుగా తెలుస్తున్నది. ముఖ్యమంత్రిగారు యీవిషయమును గురించి పరిశీలిస్తారని ఆశిస్తున్నాను. ముఖ్యమంత్రిగారి ఉపన్యాసములో చక్కెర ఫ్యాక్టరీకి సంబంధించిన భూములలో ఇతర ప్రైవేటు వ్యక్తుల భూములలో కంటె చక్కెర పంటకు ఎక్కువఖర్చు అవుతున్నట్లుగా చెప్పారు. ఎందువల్ల అంత ఎక్కువఖర్చు అవుతున్నదో, ఈలోపము ఎక్కడ ఉన్నదో ముఖ్యమంత్రిగారు దర్యాప్తు చేస్తారని ఆశిస్తున్నాను. బోధన్‌సుగర్ ఫ్యాక్టరీలో ప్రభుత్వంయొక్క ధనము 75% వరకు ఉన్నది గనుక, అది దుబారా కాకుండా Special Officer ను వేశారు గనుక, యికమీదట అందులో ఏలోపములు లేకుండా అన్నిపనులు సక్రమముగ జరుగుతాయని ఆశిస్తున్నాను. బోధన్ తాలూకాలోనే మరొకచోట ఒకచక్కెర ఫ్యాక్టరీ పెట్టటానికి నిర్ణయము జరిగినదని తెలుస్తున్నది. బోధన్‌లో ఏలాగు ఒక

factory ఉన్నది గనుకదానిని అదేతాలూకాలో నిర్మించే బదులు బన్సువాడా ఏర్పరిస్తే బాగుగవుంటుందని నేను యిదివరనుంచి చెబుతూవస్తున్నాను. బన్సువాడాలో కట్టించి నను, దానికి నిజాంసాగర్‌దగ్గరగానే ఉంటుంది గనుక, అందులోని నీరునుకూడ ఉపయోగించుకోటానికి అనుకూలముగ వుంటుంది గనుక బన్సువాడాలోనే కట్టించమని, దానిని ముఖ్యమంత్రిగారు ఆలోచిస్తారని ఆశిస్తున్నాను. ఇంకా ఎంతోమంది మాట్లాడవలసిన వారు ఉన్నారు గనుక, యింతవరకు నాకు మాట్లాడటానికి అధ్యక్షుల వారు అవకాశమిచ్చినందులకు వారికి నాహృదయ పూర్వకమైన అభివందనములు తెలుపుతూ విరమిస్తున్నాను.

శ్రీ శ్రీనివాసరావు (బోధన్):-అధ్యక్షా, ముఖ్యమంత్రిగారు యీ పరిశ్రమలను గురించిన డిమాండును ప్రవేశపెట్టుతూ, మనరాష్ట్ర ప్రభుత్వము పెద్ద పరిశ్రమల కొరకు ఎంతో కృషి చేస్తున్నప్పటికినీ, ఒక్కటిగూడ తృప్తికరముగ ముందుకు తీసుకునిరాలేకపోతున్నామని అన్నారు మన ప్రక్కనవున్న రాష్ట్రాలు సాధించ గలిగిన పరిశ్రమలైన మన ప్రభుత్వము సాధించలేకపోయినందుకు నేను ఎంతో విచారపడుతున్నాను. ప్రభుత్వము సాధించలేకపోతున్నదంటే, ఇందులో ఎక్కడో, ఏదో లోపము ఉన్నదని నా అనుమానము. విజయవాడలో ఎరువుల ఫ్యాక్టరీ కానివ్వండి, బోధన్‌లో చక్కెర ఫ్యాక్టరీ కానివ్వండి, వీటిని ముందుకుతెచ్చుకు నేందుకు రాష్ట్రప్రభుత్వము కేంద్ర ప్రభుత్వము మీద పటిష్టమైన వత్తిడితెస్తేనేగాని, కేంద్ర ప్రభుత్వమునుంచి మనకు చాలినంత ధనసహాయము లభించదు. అక్కడ ఢిల్లీలో మన రాష్ట్రమునుంచి ఎన్నుకోబడిన పార్లమెంటు సభ్యులు ఉన్నారు. మన రాష్ట్రము మన భారతదేశములో ఉన్న పెద్ద రాష్ట్రములలో ఒకటని అందరికీ తెలుసు. కేంద్ర ప్రభుత్వానికి గూడ తెలుసు. మనకు ఉన్న యిబ్బందులు మన పార్ల మెంటు సభ్యులద్వారా కేంద్ర ప్రభుత్వానికి అందజేసి కేంద్ర ప్రభుత్వాన్ని వత్తిడి చేయమని కోరితే తప్ప, కేంద్ర ప్రభుత్వానికి మనకు ఉన్న యిబ్బందులు బోధపడవు. శ్రీమతి సీతాకుమారిగారు కూడ బోధన్ చక్కెర ఫ్యాక్టరీని గురించి ఇప్పుడే చెప్పారు. బోధన్ ఫ్యాక్టరీలో ఉన్న లోపాలను సవరించటానికి ప్రభుత్వము Special Officer ను కూడ వేసింది. బోధన్ సుగర్ ఫ్యాక్టరీ దినమునకు 3,500 టన్నుల చెరుకు ఆడుతుందని అంటున్నారు. దీనిమీద ప్రభుత్వము ఎంతో లాభము సంపాదించవలసిన పరిస్థితి ఉంటున్నప్పుడు యిప్పటికి మూడు సంవత్సరాలుగా రైతులకు ఎందువల్ల బోనసు యివ్వలేదో ముఖ్యమంత్రిగారు చెబుతారని ఆశిస్తున్నాను. ఇప్పుడు Special Officer ను వేశారు గనుక, యిక ముందు అయినా ఆ ఫ్యాక్టరీ మేనేజిమెంటులో ఉన్న లోపాలు అన్నీ సవరించబడి, సక్రమపద్ధతిలో నడుస్తుందని

ఆశిస్తున్నాను. కార్మికులకు మూడు నాలుగు సంవత్సరములుగా బోనసు యిచ్చినప్పుడు రైతులలో ఆందోళన పెరగకుండా ప్రభుత్వముయొక్క పాలసీ యిది, ఫ్యాక్టరీ యొక్క పరిస్థితి యిది, అనే ఏవైనా వివరాలు కొంతవరకైనా రైతులకు చెప్పక పోవడము విచారకరముగనున్నది. ప్రభుత్వానికి రాష్ట్రములలో ఉన్న పరిశ్రమలలో ఎక్కడెక్కడ ఎక్కువ ధనము shares రూపములలో ఉన్నదో, ఆయా చోట్లలో ప్రభుత్వము అధ్వర్యము క్రింద Special Officers ద్వారా నడిపించటానికి వెంటనే చర్య తీసుకోవలసిందిగా ముఖ్యమంత్రిగారిని కోరుతున్నాను.

Central Government వారు నిజామాబాద్ జిల్లాకు ఒక expert ను పంపించినారు. వారు అక్కడి మూడు తాలూకాలలో పర్యటించారు 'నిజాం సాగర్ ఏరియా చెరకు పరిశ్రమాభివృద్ధికి చాలా అనుకూలమైనది. దేశంలో మరే ప్రాంతంలోనూ లేనటువంటి దిగుబడి యిక్కడ రావడానికిమంచి అవకాశాలున్నాయి. పంచదార పరిశ్రమను అభివృద్ధి చేయడానికి ఎక్కువగా పంచదార ఫ్యాక్టరీలను పెట్టవలసినది" అని వారి రిపోర్టులో వ్రాశారు. దానిని అనుసరించి co-operative sugar factory పెట్టుకొనుటకు 6 లక్షల రూపాయలు వసూలు చేసి, జమకట్టడం రిగింది. కాబట్టి అక్కడ వెంటనే ఫ్యాక్టరీ ఏర్పాటు చేయడానికి రాష్ట్రప్రభుత్వం తీసుకొంటున్న చర్యలను గురించి చెప్పాలని ముఖ్యమంత్రిగారిని కోరుతున్నాను.

చెరకు ధరలగురించి Central Government వారు ఒక కమిటీని వేశారు. ఆ కమిటీ వారు ధరల విషయమై ఒక formula ఏర్పాటు చేశారు. State Advisory Committee లో మన వ్యవసాయశాఖామంత్రిగారి అధ్యక్షతన జరిగిన సమావేశంలో ఆ formula చేయడం జరిగింది. ఆ formula ను అమలు చేయవలసినదిగా కేంద్రప్రభుత్వానికి తెలియజేస్తామని చెప్పారు. కాని దానిని గురించి యింతవరకూ సరైన నిర్ణయం రాలేదు. ఇట్లా ఆలస్యం జరగడంవలన రైతులకు విపరీతమైన నష్టం వస్తున్నది. వీలైనంత త్వరలో ఆ ఫార్ములాను అమలు చేయడానికి కేంద్రప్రభుత్వంపై ఒత్తిడిచేసి ఆయినా రైతులకు న్యాయమైన ధరలు ఇప్పించవలసినదిగా కోరుతున్నాము.

ఇతర అన్ని రాష్ట్రాలకంటే మన రాష్ట్రంలో పొగాకు ఎక్కువగా పండుతుంది. ఈ ముడి పదార్థంనుంచి సిగరెట్సు తయారు చేసుకోడానికి అవకాశాలు ఉన్నది. కాని, వీటిని private firms కొనటంలో వారి యిష్టంవచ్చిన ధరలతో తీసుకోవడం జరుగుతున్నది. కాబట్టి సరైన ధరలు నిర్ణయించాలి. పైగా మన

రాష్ట్రంలో ఒక సిగరెట్టు ఫ్యాక్టరీ ఏర్పాటుచేసుకోవలసిన అవసరం ఉన్నదని రైతులు ఆందోళన చేస్తున్నట్లు తెలుస్తున్నది. ప్రభుత్వం తగుశ్రద్ధ వహించి త్వరలో factory నిర్మించడానికి ప్రయత్నం చేయాలని కోరుతున్నాను.

Industrial Advisory Committee ని వేస్తున్నామని క్రిందటి బడ్జట్ సమావేశంలో చెప్పారు. కాని ఇంతవరకూ వేసినట్లు లేదు కాబట్టి ఆ కమిటీని త్వరగా ఏర్పాటు చేసి, పరిశ్రమలో యింకా అధికోత్పత్తిని సాధించడానికి ఉన్న పరిశ్రమలను బాగుచేయడానికి ప్రయత్నం చేస్తే బాగుంటుందని నేను అభిప్రాయ పడుతున్నాను.

కుటీర పరిశ్రమల విషయంలో అనేకచోట్ల అనేక రకాల ఉత్పత్తులు చేస్తు న్నారు. Non-political గా, impartial గా ఈ కుటీర పరిశ్రమలకు తగిన ప్రోత్సాహమిస్తే బాగుంటుందని మనవిచేస్తున్నాను

ఆంధ్రప్రాంతంలో పోలిటెక్నికల్ స్కూల్సు ఉన్నాయి. తెలంగాణాలో లేవు. Bodhan Sugar Factory చుట్టుప్రక్కల ఇటువంటి schools ను ఏర్పాటు చేసినట్లయితే చాలా బాగుంటుంది. ప్రభుత్వానికి అట్టే ఖర్చుకూడా ఉండదు. ఆ factory వారి ఖర్చుతోనే ఎక్కువమందిని తర్ఫీదు చేయడానికి అవ కాశం ఉంటుందనుకొంటున్నారు. కాబట్టి అక్కడ వీలైనంత త్వరలో ఒక పాలి టెక్నికల్ స్కూలును ఏర్పాటుచేస్తే ఫ్యాక్టరీవారి సహకారంతో, తక్కువ ఖర్చుతో నడపడానికి అవకాశం ఉంటుందనే విషయాన్ని ప్రభుత్వదృష్టికి తెస్తున్నాను.

రవాణాను జాతీయం చేయవద్దు అని ఎవ్వరూ అనరు. జాతీయం చేయ వలసినదే. కాని బస్సులను జాతీయం చేయుటలో పక్షపాతవైఖరి అవలంబిస్తున్నట్లు ప్రజలు అనుకొంటున్నారు. ఇట్లాంటి పరిస్థితి ఏర్పడడం మంచిదికాదు. కాబట్టి పక్షపాతం వహించారు అనుకోడానికి వీలులేకుండా చేయాలని కోరుతున్నాను ఇప్పుడు బస్సులతో పనిచేసేవారికి, యితర కార్మికులకూ కూడా ఉద్యోగాలు కల్పించవలసిన బాధ్యత ప్రభుత్వంమీదనే ఉన్నది. ప్రయాణీకులకు కూడా అద నంగా ప్రయాణ సౌకర్యాలు కలిగించవలసిన అవసరం కూడా ఉన్నది. ఈ విష యాన్ని ప్రభుత్వం గమనించాలని కోరుతూ ఇంతటితో సెలవు తీసు కొంటున్నాను.

شری ٹی۔ انجیار [Sri. T. Anjayya (Armoor)] جناب صدر۔
انڈسٹریز کے جو ڈیمانڈس چیف منسٹر صاحب نے پیش کئے ہیں میں ان کی تائید کرتے ہوئے
چند باتیں ہاوز کے سامنے عرض کروں گا۔ پچھلے سال بھی کچھ کارخانوں کے بارے
میں حکومت نے کچھ واقعات ہمارے سامنے پیش کئے تھے۔ اس سال مجھے یہ دیکھ کر
افسوس ہوتا ہے کہ گزشتہ ایک سال کے اندر ہمارے آندھرا پردیش کی
حکومت نے نئی صنعتیں قایم کرنے کی کوشش نہیں کی۔ حکومت ہند سے بارہا
نمایندگی کرنے کے باوجود حکومت ہند نے آندھرا میں نئے کارخانے قایم
کرنے کے سلسلہ میں کچھ بھی نہیں کیا۔ ہم تمام لوگوں کو اس کے متعلق کافی افسوس
ہے۔ میسور، مدراس۔ کیرالا جیسی حکومتوں نے اس معاملہ میں کافی کوشش
کی اور وہاں نئی نئی انڈسٹریز قایم ہو رہی ہیں۔ مگر بدقسمتی سمجھئے کہ سابقہ حکومت
حیدرآباد نے بھی کوئی نئی انڈسٹری قایم کرنے کی کوشش نہیں کی اور اب بھی
ہم دیکھ رہے ہیں کہ حکومت ہند بھی یہاں نئے کارخانے قایم کرنے کے لئے پیچھے ہٹ
رہی ہے۔ اس کی وجہ غالباً یہ ہے کہ ہماری طرف سے اس معاملہ میں برابر نمایندگی نہیں
ہو رہی ہے۔ چیف منسٹر صاحب نے آلوین اسبٹاس وغیرہ کے بارے میں یہ کہا ہے
کہ ہم کو اس میں شیئرز ڈیوس کرنا چاہئے۔ میں اس کی تائید کرتا ہوں لیکن ہم کو یہ معلوم
ہونا چاہئے کہ ان کارخانوں میں لاکھوں روپے کا جو نقصان ہو رہا ہے۔ لاکھوں
روپے جو لوگوں نے کھائے ہیں آخر اس کی ذمہ داری کس پر ہے۔ پچھلی حکومت
کے زمانے میں آئی۔ ٹی۔ یف کی جانب سے جو (۹) کروڑ روپیہ دیا گیا تھا وہ
کیا ہو گیا۔ اس کا حساب اگر ہمارے سامنے پیش کیا جائے تو معلوم ہوگا کہ ان
کا ذمہ دار کون ہے۔ آپ یہ روپیہ معاف کرنا چاہتے ہیں ٹھیک ہے۔ آپ
معاف کر دیجئے اور آیندہ کے لئے ان کا انسداد کیجئے۔ لیکن معاف کرنے سے پہلے

ہاؤز کو یہ بتلائیے کہ یہ کڑوڑوں روپیہ کس طرح کھا لیا گیا۔ کس طرح ان سرمایہ داروں نے فضول خرچی کی۔ یہ باتیں ہمارے سامنے آنا چاہئے۔ شوگر فیکٹری کے سلسلہ میں چیف منسٹر صاحب نے جو قدم اٹھایا ہے اس پر میں انھیں مبارکباد دیتا ہوں۔ کیونکہ آپریٹیو ڈائرکٹر کے وہاں رہنے سے وہاں کا انتظام اچھی طرح سے چل رہا ہے۔ جس طرح آپ شوگر فیکٹری میں آپریٹیو ڈائرکٹر مقرر کئے ہیں اسی طرح دوسرے کارخانوں مثلاً سرپور۔ سرسلک۔ آلوین۔ اسبسٹا س وغیرہ میں آپریٹیو ڈائرکٹر مقرر کرنا چاہئے۔ ان کے وہاں رہنے سے حکومت کے شیرس اور پیسے کی نگرانی ہو سکتی ہے۔ ورنہ اگر ہم ان سرمایہ داروں کو پیسہ دیں گے تو وہ کھا کر بیٹھ جائیں گے۔ اگر ہم ان پر کسی قسم کا کنٹرول نہ رکھیں گے تو وہ من مانی کر سکتے ہیں۔ اس کی وجہ سے صنعتیں اوپر نہیں آسکتیں۔ تاج گلاس فیکٹری کے بارے میں آج پانچ سال کے بعد چیف منسٹر صاحب ہاؤز میں اعلان کر رہے ہیں کہ اس کو لکویڈیٹ کیا جائے گا۔ ہم نے پانچ سال پہلے ہی اس کے متعلق عرض کیا تھا اور پانچ سال سے یہ عرض کر رہے تھے کہ آپ فوراً اس کا فیصلہ کیجئے۔ لیکن کوئی فیصلہ نہیں کیا گیا۔ سمپت لال کھیمی جو تاج گلاس فیکٹری کا مالک ہے۔ وہ وہاں کی مشنری اسبسٹاس شیٹ وغیرہ بیچ رہا ہے۔ اس نے پہلے سے ہی فیکٹری کو لکویڈیٹ کر کے رکھ دیا ہے اب آپ اس کو لکویڈیٹ کریں گے تو آپ کو کیا ملیگا سوائے خالی دیواروں کے۔ میں تو یہ کہوں گا کہ ایسے لوگوں کو جنھوں نے عوام کا پیسہ کھا لیا ہے جیلوں میں رکھنا چاہئے۔ سمپت لال کھیمی نے کروڑوں روپیہ کھائے ہیں ان پر بھی چھاگلا کمیشن کی طرح کوئی کمیشن بٹھایا جائے تاکہ انھیں سزا مل سکے۔ یہ کڑوروں روپیہ جو کھایا گیا ہے وہ عوام کا پیسہ ہے کسانوں کا پیسہ ہے جو ٹیکس کی صورت میں وصول کیا گیا تھا۔ یہ پیسہ عوام سے وصول کر کے ان سرمایہ داروں کو دیا گیا جس کا

نھوں نے کھا لیا۔ حکومت سمجھ رہی ہے کہ برلاز نے پراڈکشن بڑھایا ہے۔ کارخانہ ٹھیک چل رہا ہے۔ مگر میں پوچھنا چاہتا ہوں کہ وہاں جو مزدور محنت کر رہے ہیں ان کا کیا حصہ ہے۔ کیا آپ اس کے لئے بھی کچھ پرووائڈ کئے ہیں۔ آپ کب ان لو اس کارخانے میں حصہ دار بنائیں گے۔ اگر آپ اون کو حصہ دار نہیں بنائینگے تو آپ کا سکنڈ پلان کیسے کامیاب ہوگا۔ مدراس کی حکومت نے مزدوروں کے تعلق سے پارٹیسیپیشن ان مینجمنٹ ( ) کا فیصلہ لیا ہے مگر یہاں کیوں ویسا فیصلہ نہیں کیا گیا۔ انڈسٹریز کے متعلق جو اڈوائزری کمیٹی بلائی گئی اس میں ٹریڈ یونینس اور لیبر لیڈرس کو دعوت نہیں دی گئی۔ میں نے سنا ہے کہ جس طرح پچھلی حکومت کے زمانے میں سرمایہ داروں کو جس طرح ناجائز فائدہ اٹھانے کا موقع ملتا تھا اب کم ہو گیا لیکن میں یہ کہنا چاہتا ہوں کہ اس سے مزدوروں کو فائدہ نہیں ہوا۔ مزدوروں کا کوئی خاص فایدہ ہمارے سامنے نظر نہیں آرہا ہے۔ نرمل انڈسٹریل کو آپ لیجئے۔ وہاں بھی لاکھوں روپیہ کھا لیا گیا ہے۔ کاٹیج انڈسٹریز کا بھی یہی حال ہے بلکہ کاٹیج انڈسٹریز میں جتنی گڑبڑ ہے کسی اور انڈسٹری میں نہیں۔ کیوں کہ کاٹیج انڈسٹری کا نام لیکر لاکھوں روپیہ قرض دیا جاتا ہے۔ اور وہ روپیہ فضول خرچ ہو جاتا ہے۔ اس لئے میں چیف منسٹر صاحب سے یہ کہنا چاہتا ہوں کہ وہ یہ دیکھیں کہ جو روپیہ دیا جاتا ہے وہ کس طرح خرچ ہو رہا ہے۔ اس میں شک نہیں کہ ہمارے پاس ٹیکنیکل ہینڈس کی کمی ہے۔ اس کے لئے آپ ٹریننگ انسٹی ٹیوشنس کھول سکتے ہیں تاکہ ہم کو اسکلڈ ورکرس مل سکیں میں یہ سمجھتا ہوں کہ انڈسٹریز کے معاملہ میں آندھرا حکومت کی کوئی پالیسی نہیں ہے۔ محض اگریکلچر پر ڈیپینڈ کرنے سے بیروزگاری کا مسئلہ حل نہیں ہو سکتا۔ آپ اپنی ایک انڈسٹریل پالیسی بنائیے اور ملک میں جو بیروزگاری ہے اس کو ختم کیجئے جب

تک آپ انڈسٹریز کو مضبوط نہیں کریں گے تب تک بیروزگاری کا مسئلہ حل نہ ہوگا۔ مینجمنٹ کے سلسلہ میں عموماً یہ دیکھا جاتا ہے کہ بازار میں جو چیزیں کم قیمت پر ملتی ہے وہی چیز ڈبل قیمت پر اپنے رشتہ داروں سے خریدی جاتی ہے۔ اس طرح لاکھوں روپے کا فایدہ اُن کو پہنچایا جاتا ہے۔

کول مائنس کی بھی یہی حالت ہے۔ حکومت ہند نے اس کو (۷) کروڑ روپیہ دینے سے انکار کیا ہے۔ کہا جاتا ہے کہ تین یا چار کروڑ روپیہ دیا جائے گا۔ معلوم ہوتا ہے کہ اس سلسلہ میں ہماری جانب سے حکومت ہند کے پاس اچھی طرح ریپریزنٹیشن نہیں کیا گیا۔

میں آخر میں پھر ایک بار جو ڈیمانڈ پیش کئے گئے ہیں ان کی تائید کرتے ہوئے یہ کہنا چاہتا ہوں کہ ہمارے کارخانوں اور انڈسٹریز کو قرضہ دینے سے پہلے اس بات پر کافی غور کر لینا چاہئے کہ جن لوگوں کو قرضہ دیا جاتا ہے کیا وہ اچھی طرح انڈسٹریز کو چلا سکیں گے۔ اس کا کیا حشر ہوگا۔ میرا خیال ہے کہ انڈسٹریز کے معاملہ میں ایک انکوائری کمیٹی بٹھائی جائے تاکہ معلوم ہو کہ ان انڈسٹریز میں کتنا پیسہ کھا لیا گیا ہے تاکہ وہ ہاوز کے سامنے پیش کیا جا سکے۔

*శ్రీ పి. గున్నయ్య (పాతపట్నం-రిజర్వుడు): అధ్యక్షా, గౌ. మంత్రిగారు ప్రవేశపెట్టిన కోతతీర్మానమును బలపరుస్తూ కొన్ని విషయాలను మీ ద్వారా ప్రభుత్వ దృష్టికి తీసుకురాదలచాను. పరిశ్రమలను వృద్ధిచేయుటకు ప్రభుత్వం శక్తికొలది ప్రయత్నం చేయుచున్నది. రెండవ పంచవర్ష ప్రణాళికలో భారీ పరిశ్రమలకు ఇచ్చిన ప్రాధాన్యతను కుటీర పరిశ్రమలకు ఇవ్వలేదు. నిరుద్యోగ నివారణకు కుటీరపరిశ్రమలను వృద్ధిచేయవలసిన అవసరం ఎంతైనా ఉన్నది. [illegible] పంచవర్ష ప్రణాళిక కుటీర పరిశ్రమల అభివృద్ధికి అడ్డువస్తున్నవి. గ్రామాలలో [illegible] చేసే వారం, మాకు పనిలేదు. ప్రణాళికతో 1/4 లేక అర్ధభాగము, చెల్లించ మంటున్నారు, మాకు శక్తివంత పనిలేనందువల్ల అధికంగా చేము ప్రభుత్వమునకు, బహుమం

చేయలేకపోతున్నాము" అని చెప్పుచున్నారు. కాబట్టి ప్రభుత్వం ప్రతి ఇంటిలోను చిన్న చిన్న కుటీరపరిశ్రమలను స్థాపించి వారికి సౌకర్యములు కలుగజేస్తారని ఆశిస్తున్నాను.

శ్రీకాకుళంలో కొన్నివేల పుట్ల జనపనార పండుచున్నది. అక్కడ "కొన్ని పరిశ్రమలను స్థాపించి దానిని సద్వినియోగ పరచవలసిందిగా ఎన్నో పర్యాయములు ప్రభుత్వదృష్టికి తీసుకవచ్చినాను. గత రెండు సంవత్సరములలో పుట్టి 182 రూపాయలు అమ్మిన నారకు ఈవేళ 70 రూపాయలవరకు ధర తగ్గిపోయింది. ఇతరులెవ్వరూ కొనకపోవుటవల్ల రైతుల దగ్గర నిలువవుండిపోయి సరకు చెడిపోయింది. ఉన్నది చాలా స్వల్ప ఖరీదుకు అమ్ముకోవలసివచ్చినది. కాబట్టి శ్రీకాకుళం, విశాఖపట్టణం రెండు జిల్లాలలోనూ ప్రభుత్వం జనపనార ఫ్యాక్టరీలను పెట్టి కార్మికులకు పని, రైతులకు రక్షణ కల్పించాలని ప్రార్థించుచున్నాను.

అంతేకాక మాప్రాంతంలో చెరకు ఎక్కువగా ఉత్పత్తిఔతున్నది. ప్రస్తుతం బొబ్బిలి తాలూకాలో ఉన్న రెండు ఫ్యాక్టరీలుకాక సహకార పద్ధతిపై మరొక ఫ్యాక్టరీని ఆముదాలవలసలో ఏర్పరచడం చాలా సంతోషింపవలసిన విషయం. కాని అవి పూర్తి అవసరాలను తీర్చలేవు కాబట్టి పాతపట్టణంలో ఒక ఫ్యాక్టరీని, ఇెక్కలి ప్రాంతంలో మరొక ఫ్యాక్టరీని నెలకొల్పే ఏర్పాటు చేయవలయునని ప్రభుత్వమును కోరుచున్నాము.

హరిజనులకు కొన్ని సదుపాయాలు కల్గిస్తున్నారు. కాని అంతమాత్రమే చాలదు. శ్రీకాకుళం జిల్లా విషయం రెండు, మూడు పర్యాయములు మీద్వారా ప్రభుత్వమునకు విన్నవించుకొన్నాను. ఏజెన్సీ ప్రాంతంలో తోళ్లు విస్తారంగా లభించుచున్నవి. అలాంటప్పుడు ప్రభుత్వం ఆ జిల్లా మొత్తమునకు ఒక్క పరిశ్రమను మాత్రమే స్థాపించారు. ప్రతి తాలూకాలోనూ ఒక తోళ్ళ పరిశ్రమ కేంద్రాన్ని ఏర్పాటు చేసి హరిజనుల ఇబ్బందిని తొలగించాలని ప్రార్థించుచున్నాను.

అంతేకాక మా జిల్లాలో కమ్మరి, కుమ్మరి, వడ్రంగి మొదలగు వృత్తులవారు ఎక్కువగా ఉన్నారు. వారికికూడ ప్రతి తాలూకాలోను పరిశ్రమలను పెట్టి వారి ఇబ్బందులనుకూడ తొలగించాలని మనవి చేయుచున్నాను.

ఏజెన్సీ ప్రాంతంలో నూనెగింజలు, కరక్కాయలు, అనేక రకాల దినుసులు విస్తారంగా లభిస్తాయి. కాని విజయనగరంలో ఒక్క రూపాయి విలువ చేసే వస్తువు అక్కడ ఒక అణాకు మాత్రమే అమ్ముకోవలసివస్తున్నది. కాబట్టి ఈ మూనె మొద

లైన పరిశ్రమలను నెలకొల్పి ఏజెన్సీ ప్రజలకు తగిన రక్షణను కల్పించి, తద్వారా వారి యొక్క అభివృద్ధికి తోడ్పడాలని ప్రభుత్వమును కోరుచున్నాను.

మా జిల్లాలో కొబ్బరిపీచు, తాటిపీచుకూడా పుష్కలంగా లభించును. మంచం పట్టి (నవారు) కొనాలన్న దాదాపు పాతిక రూపాయలౌతుంది. కాని వ్యవసాయ దారులు, పేదజనం ఒక్క రూపాయతో ఈ తాడును కొని నేచుకొంటారు. అంతే కాక వ్యవసాయదారులకు పనికివచ్చు ఎన్నో రకముల త్రాళ్ళను వీటితో తయారు చేయవచ్చు. కాన మా జిల్లాలోని ప్రతి గ్రామములో ఈ పరిశ్రమలను స్థాపించాలని మనవి చేయుచున్నాను.

శ్రీకాకుళం జిల్లాలోని కోస్తా ప్రాంతంలో జీడిపప్పు చాలా ఎక్కువగా పండుతుందని ప్రభుత్వానికి తెలుసు. కాబట్టి జీడిపప్పు పరిశ్రమలనుకూడ ప్రతి గ్రామంలోను పెట్టి, ఆ పరిశ్రమలను కాపాడుతారని ఆశిస్తున్నాను.

శ్రీకాకుళం జిల్లాలో వేరుశనగ ఎక్కువగా పండుతుంది. కాని వాటికి సరైన ధరలేకుండా వున్నది. నూనె మిల్లులను ఆ జిల్లాలో ఎక్కువ ఏర్పాటు చేసి వాటికి సరైన ధర వచ్చేటట్లు చేసి వారి ఇబ్బందులను తొలిగించాలని కోరుతున్నాను.

తెల్ల పందులగురించి ప్రభుత్వము శ్రద్ధ తీసికొంటున్నది. కాని పెద్దపెద్ద జమీందారులు, ధనవంతులు ఒక పందిపిల్లను 20 రూపాయలకు కొని 500 రూపాయలకు అమ్ముకొంటున్నారు. అదే హరిజనులకు ఇస్తే వారొక 6 మాసములు పెంచుకొని తమ ఆదాయమును అభివృద్ధి చేసుకోటానికి అవకాశం వుంటుంది. కనుక ప్రభుత్వం పేదవారికి, హరిజనులకు పందులు లభించే ప్రయత్నాలు చేయాలని కోరుతున్నాను.

కోళ్ళ పెంపకములో కూడా డబ్బున్నవారికే ఆ అవకాశము లభిస్తున్నది. కోడి పెట్టలను, బాతులను పేదవారికి, హరిజనులకు ఇస్తే వాటిద్వారా వారు కొంతడబ్బును సంపాదించుకోగలరు. గుడ్లుకూడా అమ్ముకోటానికి వీలుంటుంది. విశాఖపట్టణం లోని హాస్పిటల్‌లోకి కావలసిన కోడిగుడ్లు ఆ జిల్లాలో లేకపోవటమువల్ల కృష్ణా గోదావరి జిల్లాలనుండి తీసుకువెళ్ళటం జరుగుతున్నది. మొత్తం ఆ హాస్పిటల్‌కు అవసరమైన కోడిగుడ్లకొరకు విశాఖపట్టణం, శ్రీకాకుళం జిల్లాలలోనే కోళ్ళను అభివృద్ధి చేయిస్తే, అక్కడి హరిజనులు, పేదవారు [illegible] బాగుపడగలవని తెలియజేస్తూ మంత్రిగారు అటువంటి ప్రయత్నాలు [illegible] కోరుతూ, సెలవు తీసి కొంటున్నాను. [illegible]

* శ్రీ జి. నరసింహమూర్తి (అమలాపురం-జనరల్) :- అధ్యక్షా ! ఈరోజు ముఖ్యమంత్రిగారు ప్రవేశపెట్టిన పరిశ్రమల డిమాండును బలపరుస్తూ కొన్ని విషయాలను మీద్వారా వారి దృష్టికి తీసుకురావాలని అనుకొంటున్నాను.

రాష్ట్రంలోవున్న పరిశ్రమల స్థితిగతులగురించి ముఖ్యమంత్రిగారు తమ ఉపన్యాసములో వివరంగా చెప్పారు. అధికాహారోత్పత్తికి అత్యధిక ప్రాధాన్యత నిస్తున్న ఈ కాలములో ఎరువుల ఫ్యాక్టరీ ఆవశ్యకతగురించి కూడా వారు చెప్పారు. కేంద్రప్రభుత్వము నుండి ఆంధ్రదేశములో ఎరువుల ఫ్యాక్టరి స్థాపన విషయములో సరైన ప్రోత్సాహం లభించడములేదని మంత్రిగారు మాట్లాడారు. భారతదేశానికే కాక విదేశాలకు కూడా అవసరమైన ఆహార ధాన్యాలను పంపించగలిగిన స్తోమత, అవకాశములు ఒక్క ఆంధ్రప్రదేశ్‌లో మాత్రమే గలవనే సంగతి అందరికి తెలుసు. ఆ అవకాశాలను పెంపుచేస్తే ప్రతి ఎకరములోని పంటను రెట్టింపు చేయటానికి వీలు అవుతుంది. ముఖ్యమంత్రిగారు కేంద్రప్రభుత్వమును ఒప్పించి ఆంధ్రప్రదేశ్ ఎరువుల ఫ్యాక్టరి స్థాపనకు కృషిచేయాలని మనవిచేస్తున్నాను. ముఖ్యమంత్రిగారు వెనుకాడే మనిషికారు. ఈ కార్యక్రమ విషయంలో సాహసోపేతమైన కృషి చేస్తారనే నా విశ్వాసము. వారు అన్ని పరిశ్రమలగురించి ప్రసంగించారు. గాని మన రాష్ట్రములో లేని అతి ముఖ్యమైన పరిశ్రమ విషయమై వారు ప్రస్తావించలేదు. ఆ పరిశ్రమను స్థాపించినట్లయితే రాష్ట్రప్రభుత్వ ఆదాయము అధికమవుతుంది.

కోనసీమ ప్రాంతములో గోదావరి సెంట్రల్ డెల్టాలో రాజోలు, అమలాపురం కొత్తపేట తాలూకాలలో సుమారు లక్ష ఎకరముల కొబ్బరితోట వున్నది. ఏకరమునకు 50 చెట్ల చొప్పున 50 లక్షల కొబ్బరిచెట్లుగల ప్రాంతమది. ప్రతి సంవత్సరము ఒక్కొక్క చెట్టుకు 100 కాయలు కాస్తాయి. దీనివల్ల 500 కోట్ల కాయ ప్రతి సంవత్సరము లభిస్తుంది. అవసరాల కోసం స్థానిక ప్రజలు ఒక కాయను 0-1-0కు 0-0-6 అమ్ముతున్నారు. వాటిని ఏ బొంబాయి వారో కొనుక్కొంటున్నారు. ఆ లాభము కోనసీమ ప్రజలకు రాకుండా పోతున్నది. కాబట్టి అక్కడ లభ్యమయ్యే కొబ్బరి పీచు, చిప్ప, డొక్కలతో, పారిశ్రామిక పద్ధతులపై పరిశ్రమను అభివృద్ధి చేయవచ్చు. మలబార్, కేరళలో ఒక కొబ్బరికాయనుండి 60,70 రూపాయల వరకు కిమ్మతుచేసే వస్తువులను ఉత్పత్తి చేస్తున్నారని కళావెంకటరావుగారు చెప్పారు. కొబ్బరి పరిశ్రమకు సంబంధించిన వివరములు అక్కడనుండి ఈ ప్రభుత్వము ఎందుకు సేకరించదో ఎందుకు అభివృద్ధి పర్చదో నాకు తెలియటంలేదు. ఈ విషయమును అనేకసార్లు నేను ఈ సభలో మంత్రిగారి దృష్టికి తెచ్చాను. గతసారి నేను ఈ విషయం చెప్పగా కళావెంకటరావుగారు, నరసింహమూర్తిగారు

కోనసీమ కొబ్బరిపీచు గురించి మాట్లాడారు కాని అది లాభదాయకం కాదు." అని ముఖ్యమంత్రిగారు చెప్పారు. ప్రైవేటువ్యక్తులు రు. 100 రు. 50 లలో పెట్టుబడి పెట్టినంత మాత్రాన లాభం ఎట్లావస్తుంది ?

అందుచేత నేను మనవిచేసేది-మన ప్రభుత్వం కేరళ ప్రభుత్వంతో సంప్రదించి కాని, లేక ఇక్కడి పారిశ్రామిక శాఖోద్యోగులను, కొబ్బరి ఉత్పత్తిదారులను అక్కడకు పంపించి, వివరాలను సేకరించి గాని, తక్షణం కోనసీమ సెంట్రల్ డెల్టాలో, కొబ్బరి పరిశ్రమకు సంబంధించిన కార్యకలాపాలకు, యిప్పుడైన కృషి చేయవలసినదని తమద్వారా ముఖ్య మంత్రిగారిని కోరుతూ, ఈ అవకాశము ఇచ్చినందుకు తమకు ధన్యవాదములను తెలియజేస్తూ విరమిస్తున్నాను.

*శ్రీ బి. శ్రీరామమూర్తి : అధ్యక్షా ! ప్రజల జీవిత ప్రమాణాన్ని పెంచాలంటే ప్రణాళికా బద్ధమైన పురోగమనాన్ని సాధించాలని మనం ప్రయత్నం చేస్తున్నాము. అట్టి జీవిత ప్రమాణాభివృద్ధి కేవలం పన్నులు వేయుటవల్ల సిద్ధించదు. పారిశ్రామికాభివృద్ధి కావాలి. అది ప్రభుత్వం గుర్తించినట్లు కనిపించదు. ఆదాయన్ని పెంచడానికి కేవలం పన్నులమీద ఆధారపడుతున్నది ఈ ప్రభుత్వం.

"Two things are certain in this world; one is taxes and the other is death." అని ఒకరన్నారు. అసలు ఒక రకంగా చూచినట్లయితే, వ్యవసాయరంగంలో మనము పరిష్కరించలేని సమస్యలను పారిశ్రామికరంగంలో పరిష్కరించవలసి యున్నది. జనాభా ఒత్తిడి వ్యవసాయము మీద ఉన్నట్లయితే, ఆ ఒత్తిడిని తగ్గించేందుకు కుటీర పరిశ్రమలను గాని, small scale industries గాని, భారీపరిశ్రమలను గాని పెట్టి, కొంత జనబాహుళ్యాన్ని మళ్లించవలసిన అవసరం ఉన్నది. ఇంతవరకు ఏడు సిమెంటు ఫ్యాక్టరీలు పెడతామని చెప్పిపెట్టలేదు. ఉదాహరణకు విజయనగరంలో ఒక సిమెంటు ఫ్యాక్టరీ పెడతామని చెప్పిపెట్టలేదు. ప్రస్తుతం ఈఫ్యాక్టరీలు యేస్టేజిలో యున్నవో, ఆ విషయమైనా ముఖ్యమంత్రిగారు వివరించవలసిన అవసరం ఉన్నది. సిమెంటు ఫ్యాక్టరీలేకాదు, షుగర్ మిల్సు ఉన్నాయి. ఫారన్ ఎక్స్చేంజి దొరకడంలేదని చెప్పారు. ఈ సందర్భంలో ఒక్కవిషయం మాత్రం కేంద్ర ప్రభుత్వానికి స్పష్టం చేయవలసిన అవసరం ఉన్నది. ప్రయివేటు సెక్టర్‌లో ఉన్నటువంటి పరిశ్రమలకు foreign exchange అవసరం అంటే ఆనవచ్చు గాని, కోపరేటివ్ బేసిస్ మీద పెట్టేదానికికూడ ఈమాటే చెప్పడం న్యాయంకాదని చెప్పి, దాని అభివృద్ధికి తోడ్పడవలసినదిగా కోరుచున్నాము. రెండవప్లానులో 1958-59 సంవత్సరానికి ఆంధ్ర

ప్రాంతానికి 56.49 లక్షలు ఉంటే తెలంగాణా ప్రాంతానికి 12.49 లక్షలు ఖర్చు చేయడానికి నిశ్చయించారు. రెవిన్యూ అక్కౌంట్సు చూచినట్లయితే వంద లక్షలు ఆంధ్ర ప్రాంతంలోను, 16 లక్షలు తెలంగాణా ప్రాంతంలోను ఖర్చు చేయబోతున్నారు. తెలంగాణాకు బడ్జెట్టులో 12.49 లక్షలు మాత్రమే కేటాయిస్తే, యేవిధముగా ఆప్రాంతమును అభివృద్ధి చేయగలగుతాము. ఆప్రాంతంలో పరిశ్రమలను యేవిధముగా పెంపొందించగలమో అన్నది అనుమానంగానే ఉన్నది. ఈ సందర్భంలో ఒక ముఖ్యవిషయాన్ని మనవి చేయదలచుకొన్నాను. తెలంగాణా ప్రాంత States Securities Reserve Bank లో సుమారు 11 కోట్ల రూపాయలు ఉన్నవి. ఆ డబ్బును వెంటనే ప్రభుత్వం రిలీజుచేయుటకు ఎందుకు ప్రయత్నించకూడదు? ఆమొత్తాన్ని తెలంగాణా ప్రాంత అభివృద్ధికోసమే ఖర్చు చేయవచ్చును. అంతేకాదు క్రొత్త పరిశ్రమలను ఏమీ స్థాపించలేదు. ఉన్నపరిశ్రమలు చాలా అధ్వాన్న పరిస్థితులలో ఉన్నట్లు, ప్రభుత్వ వివరాలవల్ల తెలుస్తున్నది. ఇప్పుడు ఉన్న పరిశ్రమలు అన్ని నేషనలైజేషన్ సెక్టరులోనే ఉన్నవి. అయినప్పటికి గడియారంముల్లు వెనుకకు త్రిప్పడానికి జరుగుతున్న ప్రయత్నంగా ఉన్నది సోషలిజం లక్ష్యంగా పట్టుకొన్న యీ ప్రభుత్వం, ప్రయివేటు పెట్టుబడిదారుల చేతులనుంచి పరిశ్రమలను తీసుకొనుటకు బదులు, ప్రభుత్వపరిశ్రమలనే ప్రయివేటు పెట్టుబడి దారుల చేతులలోకి యిచ్చుటకు ప్రయత్నిస్తున్నది. ఇది సోషలిజం లక్ష్యానికి ఏ రకంగా అనుగుణంగా ఉన్నదో తెలియదు. అయినప్పటికీ ముఖ్యమంత్రిగారు సోషలిజం గురించి మాట్లాడడానికి అభ్యంతరం ఉండదు. ఏ గౌహతి కాన్ఫరెన్సులోనో ! ఒక ఆయన సోషలిజం గురించి డెఫినిషన్ యిస్తూ "Socialism is a like old hat, thus suits every head" అన్నాడు. అందుచేత ఆ టోపి యెవరైనా పెట్టుకోవచ్చు. ఈనాడు సోషలిజానికి శాసనసభా భవనములో మంత్రులు, అధికార్లు పెట్టినటువంటి full stop వలన, ప్రజాస్వామ్యానికి పెట్టినటువంటి కామావలన, దేశంలో ప్రభుత్వాలు పెట్టుకొన్నటువంటి లక్ష్యాలు, పట్టీలు కొడుతున్నవన్న సంగతిని ప్రతి ఒక్కరూ గమనిస్తూనే యున్నారు. తరువాత "పూర్వం చేసిన ప్రభుత్వ నిర్ణయాలకు, మాకు సంబంధంలేదని" చెప్పడం పరిపాటి అయిపోయింది. ఇకముందునుంచైనా ముఖ్యమంత్రిగారు అలా అనకుండా వుంటే బాగుంటుంది. ఆస్తి వారసత్వాన్ని కోరుతూ, అప్పులను మాత్రం ముట్టుకోను అన్న వారసుడుమాదిరిగా యున్నది, ప్రస్తుత ప్రభుత్వం యొక్క విధానము. అది సరికాదు. ఆస్థులను యెప్పుడైతే కోరుతున్నారో, అప్పులకు, లావా దేవీలకు అన్నింటికి ప్రభుత్వం పూర్తి బాధ్యత వహించవలసినదే ! పైగా "గతాన్ని మరచిపోండి" అంటున్నారు. గతాన్ని మరచిపోయే విధానము సరియైనది కాదు. Where the pin pinches అన్నది మనకు స్పష్టంగా తెలియాలి. అది తెలియకపోయినట్లయి తే

అందులో ఉన్నలోపాలను తెలుసుకోలేక పోతాము. అందువల్ల గతాన్నిగురించి సంపూర్ణంగా విచారణ చేసేదానికి ఒక కమిటీ వేయాలి. ఇదివరలో కమిటీలువేశారు. కస్తూర్భాయి లాల్‌భాయి కమిటి ఉన్నది. వాడియా కమిటి ఉన్నది. ధాగే ఎంక్వయిరీ కమిటి ఉన్నది. ఈ కమిటి రిపోర్టులన్నీ దాచిపెడుతున్నారు. అది సరియైన పద్ధతి కాదు. ఆ రిపోర్టులను తెలియజేయవలసిన పరిస్థితిఉంది. అసలు పరిశ్రమలలో ఉన్న కుళ్లను పూర్తిగా పారద్రోలాలంటే ప్రజల సహకారం అవసరం, అని అంటారు, ప్రజల సహకారం లేనిదే ఆ కుళ్లు పోదని ఒప్పుకొంటారు. ఇది, పిచ్చి కుదురుతేగాని పెళ్ళి కుదరదు - పెళ్ళికుదురుతే గాని, పిచ్చిపోదు అన్నట్లుగా ఉన్నది. అందువల్ల ఈ వ్యవహారాలు అన్నింటిని క్షుణ్ణంగా విచారించటానికి ఒక కమిటి వేయాలని ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తున్నాను.

మేనేజింగు ఏజన్సీ పద్ధతి ఉన్నది. ఆ పద్ధతినే రద్దు చేయవలసిన అవసరం ఉన్నది. ఇందులో ఏవిధంగాను కాలయాపన చేయవలసిన పనిలేదు. ఆ మేనేజింగు యేజన్సీవల్ల తప్పు జరిగింది అని చూపిస్తే, "మొన్ననే ఒక I. C. S ఆఫీసరును వేశాము. ఫరవాలేదు" అంటారు. ఒక ప్రక్క ప్రభుత్వానికి, అధికంగా షేర్పు ఉన్న పరిశ్రమలను, నడిపించలేక ప్రయివేటు పెట్టుబడి దారీ ఏజన్సీలకు యివ్వడం జరుగుతున్నది. వారు నడిపించలేని పరిస్థితులలో ఉన్నప్పుడు, మన ఆఫీసర్లను పంపడం జరుగుతున్నది. ఇది సరియైన విధానముకాదు. ఈ మేనేజింగు యేజన్సీ పెద్దవారు ఉన్నవారి చేతులలోఉంది. దీనిని బట్టి "laws reign the poor, rich rule the law" అని అనిపిస్తున్నది. ఈ పద్ధతివల్ల లాభంలేదు.

[*Sri S. Ranganatha Mudaliar in the Chair*]

ఉదాహరణకు సిర్పూరు పేపరు మిల్లు తీసుకోండి, సర్‌సిల్కు తీసుకోండి! బిర్లా బ్రదర్స్ మేనేజింగ్ యేజెన్సీ తీసుకొన్నారు. ఒక్క కానీ పెట్టుబడి పెట్టలేదు. అటువంటి వారికి పెత్తనం యెందుకు యివ్వాలి? ప్రభుత్వం వారితో లాలోచి అయినదని అనుకోవలసివస్తుంది. తప్పకుండా అటువంటి అనుమానానికి ఆస్కారంయిస్తున్నారు. అందుచేత ఇది సరియైన పద్ధతికాదు. సర్‌సిల్కుకు యిచ్చిన అప్పు యిప్పుడిప్పుడే కొంచము కొంచము వస్తున్నదని చెప్పారు. కొంచము, కొంచము అంటే, తక్కిన తప్పు[illegible]మైనది? మూడు కోట్లు [illegible] యిచ్చారు. ఆ మూడు కోట్లు Share Capital క్రిందకు మార్చడానికి ప్రభుత్వం యెందుకు ప్రయత్నం చేయకూడదు? ఆవిధంగా చేస్తే బాగుంటుందని ఒక సూచన చేస్తున్నాను.

తాజ్ గ్లాస్ వర్క్సు హైదరాబాదులో ఉన్నది. గతసంవత్సరము, జెక్ దేశ experts తో కలసి మేనేజ్ చేస్తామని చెబితే ప్రభుత్వం అవకాశం యివ్వలేదని తెలిసినది. అది యెంతవరకు నిజమో మంత్రిగారు తెలియజేయాలని కోరుతున్నాను. ఈ తాజ్ గ్లాస్ వర్క్స్ అసలు పనిచేయడమేలేదు, శ్రీ సంజీవరెడ్డిగారు, నిర్జీవంగా యున్న ఈ పరిశ్రమకు సంజీవి పోసినట్లయితే బాగుంటుందని విజ్ఞప్తి చేస్తున్నాను.

శ్రీమతి టి. లక్ష్మీకాంతమ్మ :- అధ్యక్షా! ముఖ్యమంత్రిగారు ప్రవేశపెట్టిన industries demand ను బలపరుస్తూ పరిశ్రమలలో మార్పుచేయడానికి కాని, అభివృద్ధికి కాని కొన్ని సూచనలను తెలియచేయదలుచుకున్నాను. మొదటి పంచ వర్ష ప్రణాళికలో మనం ఎక్కువగా వ్యవసాయం మీదనే stress చేశాము, రెండవ ప్రణాళికలో పరిశ్రమల మీద stress చేయబడుతోంది. దేశం పారిశ్రామికంగా అభివృద్ధి చెందనిదే, సౌభాగ్యవంతంకాదనే సంగతి నిర్వివాదాంశం. మనం మొదటి ప్రణాళికలో చిన్న చెరువు మరమ్మతు మొదలుకొని నాగార్జునసాగర్ ప్రాజక్టు నిర్మాణం వరకు అమలు జరపడానికి కృషి చేశాము. మన రాష్ట్రానికి సంబంధించినంత వరకు రెండవ ప్రణాళికలో పరిశ్రమల అభివృద్ధి ఎక్కువ అవసరమైనప్పటికీ కూడా దానిపై ఎక్కువ stress చేయకుండా ఇతర items మీదనే ఎక్కువ ఖర్చు పెట్టడం కొంత విచారకరంగా ఉంది.

రెండవ పంచవర్ష ప్రణాళికలో ఆంధ్రకు రు 175.35 కోట్లు కేటాయించడం జరిగింది. దానిలో రు. 39.85 కోట్లు వ్యవసాయానికి, రు. 76.46 కోట్లు ఇరిగేషన్ మరియు పవర్‌కు, రు. 7.69 కోట్లు ట్రాన్స్‌పోర్టుకు, రు. 37.09 కోట్లు మిస్‌లేనియస్ మరియు సోషల్ సర్వీసుకు, రు. 14.26 కోట్లు ఇండస్ట్రీస్‌కు కేటాయించారు. 1956 నుంచి 1961 సంవత్సరం వరకు- రెండవ ప్రణాళికా కాలంలో- ఆంధ్రకు కేటాయించిన రు 175 కోట్లు మొత్తంలోను పరిశ్రమల కొరకు రు. 14½ కోట్లు మాత్రమే కేటాయించబడినట్లు స్పష్టమౌతోంది. దీనిలో కొంత కేంద్రంనుంచి అప్పుగా వస్తుందనుకొంటున్నాను. అయితే ఈ సంవత్సరం తెలంగాణా ప్రాంతానికి ఒక్క scheme కూడా లేదు. కేంద్రప్రభుత్వమిచ్చే "లోను" మినహా ఆంధ్రప్రదేశ్ మొత్తానికి 1957-58 సంవత్సరంలో రు. 6.36 లక్షలు మాత్రమే ఖర్చు జరిగింది. దీనిలో నాలుగు schemes మాత్రమే తీసుకోబడ్డాయి. అందులో "expansion" కు రెండు మాత్రమే ఉన్నాయి- (1) రాజమండ్రిలోని పేపర్ మిల్లు (2) గూడూరులోని గవర్నమెంటు సిరమిక్ ఫ్యాక్టరీ. తిరుపతిలో స్ట్రాబోర్డు అండ్ పేపర్ మిల్సు, ఒక్కటి మాత్రమే స్టార్టు చేయబడింది. ఇంకా కొన్ని కోఆపరేటివ్ సుగర్ ఫ్యాక్టరీలను ప్రారంభించాలని అనుకొంటోంది. వీటి విషయంలో

కేంద్రప్రభుత్వం శ్రద్ధతీసుకొని ఏమీ సహాయం చేయడం లేదు. Share capital కూడా చాలా ఎక్కువ వసూలు చేయబడింది. కానీ నిరుత్సాహకరమైన పోలసీ వల్ల అతిశీఘ్రంగా అమలు జరగడం లేదు. ఇప్పటికి ఒక్క sugar factory మాత్రమే ఆమోదింపబడినదని చెబుతున్నారు. మనం ఒకవైపు private sector ను encourage చేయడం లేదు. ప్రభుత్వం ఏ క్షణంలో జాతీయం చేస్తుందోనన్న భయంతో private వ్యక్తులు పరిశ్రమలను స్థాపించడానికి ముందుకు రావడంలేదు. ఇదివరకు ఎన్నో "ఎంటర్‌ప్రైజెస్"లో పెట్టుబడి పెడుతూ ఉండేవారు. కానీ ఈనాడు జాతీయాకరణ భయంతో పరిశ్రమలలో invest చేయడానికి ఎవరూ ఇష్టపడటం లేదు. "Capital today is shy like an orthodox old fashioned lady,' Co-operatives కూడా చాలా నిరుత్సాహంగా ఉన్నాయి. ఒకవైపు వ్యక్తులు ముందుకు రావడం లేదు. ఇంకో వైపు co-operatives స్థితి ఉత్సాహవంతంగా లేదు. మంత్రివర్గంలో ఒకరైన శ్రీ తిమ్మారెడ్డిగారు దీనినిగురించి వారి అభిప్రాయాన్ని చెబుతున్నారు. He is crying hoarse from house-tops that 'co-operation' is a failure.

Sugar factories లోని share-holders కూడా చాలా నిరుత్సాహం చెంది ఉన్నారు. Co-operative విషయంలో మన policy ఈ విధంగానే ఉంటే, మన లక్ష్యమైన Socialist Co-operative Common Wealth ఇంకా చాలాదూరం ఉన్నదని చెప్పవలసి వస్తుంది. మన మంత్రివర్గం ఈ Co-operative Sugar Factories ను తప్పక అంగీకరించాలని కేంద్రంపై వత్తిడి తీసుకురావాలని కోరుతున్నాను. ఒక వైపు private sector ను encourage చేయకుండా, ఇంకొక వైపు co-operatives ను discourage చేస్తే "suicidal policy" అవుతుందే కానీ, అది ఏమీ అంత ఉపయోగకరంగా ఉండదు. ఇప్పటికి ఆంధ్రలో ఉన్న "తుమపాల, ఉయ్యూర్" Co-operative Sugar Factories private వ్యక్తుల చేతుల్లోకి పోయాయి. ఇంతకు ముందు చర్చలలో ప్రభుత్వం నడిపే పరిశ్రమలకు మంచి పేరు లేదనియు, అందులో ముఖ్యంగా అలాంటివి తెలంగాణాలో ఉన్నాయని, అవి objects of scandals అయినాయని అన్నారు. కానీ ముఖ్యమంత్రిగారి ఉపన్యాసం విన్నతరువాత, improve చేయడానికి ఎంతో ప్రయత్నం జరుగుతోందని, ఈ పరిశ్రమలనుంచి ప్రభుత్వానికి ఇంకా ఎక్కువ ధనం రాగలదని ఆశిస్తున్నాను.

మనకు ఆంధ్రదేశంలో గోదావరి, కృష్ణ, తుంగభద్ర, నాగార్జున సాగర్ మొదలైన dams ఉండటంవల్ల "Andhra is the grannery of India" అని అనుకొంటున్నాము. అయినా కొందరి ప్రజలయొక్క జీవన ప్రమాణాం పెంచలేక పోయాము. పెద్ద, పెద్ద పరిశ్రమలు ఇక్కడకు వస్తాయనే ఆశకూడా చాలా నిరాశగానే కనిపిస్తోంది. ఇప్పట్లో వస్తాయనే విశ్వాసంకూడా కనిపించదు. అందుచేత మనం medium పరిశ్రమలను, village & small scale industries ను co-opertive lines మీద develop చేసుకోవడానికే మన దృష్టిని కేంద్రీకరించాలి. దీనివల్ల నిరుద్యోగ సమస్యకూడా చాలావరకు తగ్గడానికి అవకాశముంది. Large scale and small scale industries ఒకదానికొకటి conflict గా ఉంటాయని నేను అనుకోను. ఎందుచేతనంటే

"The conflict between large-scale and small-scale industries is often interpreted as a conflict between the objective of full employment and that of higher productivity. But, as a matter of fact higher productivity does not clash with the objective of full employment. If the objectivity of higher productivity means that the Nation ought to produce enough of a commodity in absolute terms, it is evident that it can be achieved as well by organising production in large number of small manufacturing units. And from the point of view of full employment, it is the first alternative that must be chosen."

శ్రీ ఎమ్. సాయిలు :- అధ్యక్షా ! మంత్రిగారు ప్రవేశపెట్టిన ఈ పద్దును బలపరుస్తూ, కొన్ని సూచనలు చెయ్యదలచుకున్నాను. దేశంలో అన్ని రంగాలకు చెందిన పరిశ్రమలను అభివృద్ధి చెయ్యాలనీ, సభావేదికల మీద ఉపన్యాసాల ద్వారా చెబుతున్నాము. భారతదేశంలో రెండవ వ్యాపారసంస్థగా పరిగణించబడిన, చర్మ పరిశ్రమ, మన రాష్ట్రంలో ఎంత సొగసుగా ఉన్నదో మనకందరికీ, తెలిసిన విషయమే. ఈ చర్మ పరిశ్రమను ప్రభుత్వము, చిన్న చూపుగా చూస్తున్నదనీ చెప్పక తప్పదు. ఈ నాడు, చర్మ కార్మికులుగా చర్మ వ్యాపారం చేసుకుంటూ, చర్మాలను శుద్ధిచేస్తూ, చెప్పులు కుట్టడం, వ్యవసాయ పనిముట్లు మొదలైన వస్తువులు తయారు చేస్తూ, కేవలం ఈ చర్మానికి సంబంధించిన వ్యాపారం మీదనే ఆధారపడి బ్రతికేవారు నూటికి 35 మంది ఉన్నారు అని అందరికీ తెలిసిన విషయమే ముఖ్యంగా ఈ పరిశ్రమ, విదేశాలనుంచి వచ్చిన అబ్బీల చేతులలోను, మద్రాసునుంచి

వచ్చిన తురకవారి చేతులలోను ఉన్నది. లక్షలకు లక్షలు రూపాయల లాభాలను, వాళ్లు గడిస్తున్నారు.

ఒక్క మా జిల్లాలో రమారమి 40 చర్మకార్ఖానాలు ఉన్నాయి. ఒక్కొక్క కార్ఖానాలో 5, 6 వందల కార్మికులు ఉన్నారు. ఈ లబ్బీలు అక్కడకు వచ్చి, రెండు, లేక, మూడు రూపాయలకు ఒక్కొక్క చర్మాన్ని కొని, దానిని ఈకార్మికుల చేతులతోనే శుద్ధి చేయించుకొని, తయారు చేసిన తరువాత ఒక్కొక్క మేకతోలును 25 రూపాయల చొప్పున విదేశాలకు ఎగుమతి చేస్తున్నారు. నేనుకూడ ఈ చర్మ కార్మిక training కు వెళ్ళాను. కాని ఇప్పుడు నాదగ్గర సరియైన figures లేవు. అయితే, ఈవిధంగ మనదేశ వస్తువును, విదేశాలకు పంపించవలసిన కారణం ఏమిటి? ఇదొక వ్యాపార సంస్థగా పెట్టుకొని, లబ్బీలు, మద్రాసు నుంచి వచ్చిన తురకవాళ్ళు, ఎంతో లాభాన్ని సేకరిస్తున్నారు కాని చర్మ కార్మికుల జీవన ప్రమాణము స్తంభించిపోయి, వృద్ధిజెందక, దినదినమూ దిగజారిపోతున్నది.

ఏవోకొన్ని, leather industries, co-operative societies అని అంటున్నారు. దానికి, Khadi Industries Board నుంచి ఏదో కొంత సహాయము లభిస్తున్నది. అయినప్పటికినీ, దానిలో కొన్ని అవక తవకలు నడుస్తున్న మాట వాస్తవం. ఈ ఉన్న కొద్దిపాటి society లు కార్మికుల చేతులలోగాక, ఇతరుల చేతులలో ఉన్నది అన్న సందేహము ప్రతివాళ్ళలో ఉన్నది. పరిశీలిస్తే చర్మ కార్మికులు ఎవ్వరూకూడ అందులో లేరని రూఢి అవుతుంది.

ఎవరో కొంతమంది వ్యక్తులు, మేము చర్మ కార్మికులకొరకు, society లు పెడతామని ముందుకు వొచ్చి, దానిని register చేయించుకొని, Khadi Board నుంచి సహాయం పొందుతూ, ఎన్నో లక్షల రూపాయలు గడిస్తున్నట్లు, information ఉన్నది, దానిలో వాస్తవం లేకపోలేదు. పేద కార్మికులకు, సహాయము చేస్తామని వాళ్ళను ప్రోత్సహించి, నమ్మించి, లాభాలను కొట్టుకుపోతూఉన్నారు

ఒక పులి తినివిడిచిపెట్టిన మాంసపుకండ ఒక నక్కకు దొరికింది. నక్క దానిని తీసుకువచ్చి ఏటి ఒడ్డున పెట్టుకున్నది. అంతలో ఒక గద్ద వొచ్చి, రెక్కలతో నీటిని కొట్టగానే, నీళ్ళలో ఉన్న చేపలన్నీ గుప్పుగుప్పున దుముక ప్రారంభించాయి. నక్క ఆ కండను విడిచిపెట్టి చేపలను పట్టబోయింది. అంతలోనే ఆకాస్త కండ ముక్కను గద్ద ఎత్తుకుపోయింది.

ఈ చర్మ కార్మికుల పరిస్థితికూడ, ఆ విధంగానే ఉన్నదని చెప్పక తప్పదు. పల్లె గ్రామములలో నూటికి 35 మంది చర్మానికి సంబంధించిన చేతివృత్తుల

మీదనే, చెప్పలు. రైతులకు సంబంధించిన వస్తువులను తయారు చేసుకొని జీవిస్తు న్నారు. అలాంటప్పుడు, ప్రభుత్వము, వృత్తి పనులలో, వాళ్ళ వాళ్ళ స్థాయిలలో, వాళ్ళను ప్రోత్సహిస్తేనేగాని, దేశం బాగుపడదు. వాళ్ళపరిస్థితి బాగుపడిననాడే, వాళ్ళు చదువుకోగలుగుతారు. విజ్ఞానవంతులు కాగలరు. అందరితోబాటు. వాళ్ళుకూడ; సమాన స్థాయిలోకి రాగలుగుతారు.

ఇక, ఈ భూసంస్కరణలు తీసుకురావాలని అంటున్నాము. ఇది ఎవరి కొరకో, నాకు అర్థం కావడం లేదు. బీదవారికి ఏమి లాభం ? వాళ్ళకు ఏమితెచ్చి పెడుతుంది ? ఈనాడు భూములన్నీ ఎవరి చేతులలో ఉన్నాయి ? వీటిని అన్నింటినీ, ఆత్మ విమర్శనా పూర్వకంగా ఆలోచిస్తే బీదవాళ్ళకు ఈ భూసంస్కరణలు, ఏ విధం గాను తోడ్పడవు ఈ భూసంస్కరణలు అక్కరలేదనే నా వాదన. అన్నింటి కంటె మొదలు, పరిశ్రమలను అభివృద్ధి చేస్తేనే గాని, బీదవాళ్ళ జీవన ప్రమాణం పెరగదు. ఎవరి వృత్తులలో వారికి ప్రభుత్వసహాయం దొరికిననాడె వాళ్లు, బాగుపడే అవకాశం ఉంది. కావున నేను ప్రభుత్వాన్ని కోరేది ఏమంటె, ఈ చర్మ కార్మికులకు అన్యా యం జరగకుండా, cotton industries, చెరకా సంఘాల మాదిరిగానే, దీనిని కూడ, కుటీర పరిశ్రమగా పరిగణించి, గ్రామాలలో వృద్ధిపొందేటట్లు చూడాలని కోరుతున్నాను. ముఖ్యంగా, Khadi Board లో, ఎక్కువగా ఈ చర్మ పరి శ్రమలను పెడతామని, ఎన్నెన్నో చెప్పారు. అవి ఎక్కడ పెట్టారో, ఎంత అభి వృద్ధి చెందినవో, తెలియడం లేదు. ప్రభుత్వము ఈ విషయాన్ని పరిశీలించి, సభ్యు లకు దాని వివరాలు అందజేస్తారని మనవిచేస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

*శ్రీ బి. జి. ఎం. ఎ నరసింగరావు (కణితి) :-అధ్యక్షా ! ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వపు, ఈ పరిశ్రమల శాఖా పద్దును నేను స్తుబలపరుస్తున్నాను. ద్వితీయ పంచ వర్ష ప్రణాళికలో, ముఖ్యంగా ఈ పరిశ్రమలకు ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చారు. ప్రణాళిక లక్ష్యాలను budget లో కేటాయించిన ప్రకారంగా, మన ప్రభుత్వము పూర్తిగా, అమలు జరుపుతున్నదని చెప్పక తప్పదు. గత సంవత్సరం జరిగిన పారిశ్రామిక రంగాన్ని సమీక్షి చేసినట్లయితె, పంచదార మిల్లులను, నూలు మిల్లులను, సిమెంటు మిల్లులను, మొదలైనవి, నెలకొల్పి, ఇతోధిక కృషి చేసినందులకు ప్రభుత్వానికి మనం తప్పకుండా జోహార్లు చెయ్యవలసిఉన్నది. అంతేకాకుండ ఈ సంవత్సరపు butget లో ఉన్న proposals చూస్తే, మన ప్రభుత్వము, ఈ పారిశ్రామిక రంగంలో, సర్వతోముఖ, కృషి, చెయ్యడానికి, నిశ్చయించుకున్నట్లు స్పష్టంగా కనబడుతున్నది.

ఏది ఏమైనా, మన అవసరాల దృష్ట్యా చూస్తే, ఎంత కృషి చేసినాకూడ, చాలదని చెప్పక తప్పదు. ఈనాడు, మన అవసరాలు విపరీతంగా ఉన్నాయి. కాని, మన అవసరాలకు తగ్గట్లు డబ్బు లభ్యము అవుతుందో, లేదో, చూస్తే, మనకు డబ్బు మాత్రము కొరతగా ఉన్నట్లు కనిపిస్తున్నది. ఈ రెండింటిని సమన్వయ పరచి, పారిశ్రామిక policy ని, ప్రభుత్వము, సక్రమంగా నిర్వర్తించాలి. మిగతా దేశాలతో పోల్చి చూస్తే, భారతదేశంకూడ, పారిశ్రామికంగా ముందుకు పోవడానికి, అన్ని విధాల కృషి చేస్తుందనే చెప్పాలి.

ఈమధ్య నేను జర్మనీకి వెళ్ళి చూచాను, యుద్ధం మూలకంగా అక్కడి పరిశ్రమలు పూర్తిగా సర్వనాశనం అయిపోయినవి. యుద్ధం అయిన తరువాత war reparation పేరుతో, అక్కడ మిగిలిపోయి ఉన్న యావత్తు కర్మాగారాలను అన్ని దేశాలవారు పంచుకున్నారు. పూర్తిగా blunder చేసేశారు. యుద్ధానంతరం అక్కడ ఏమీ లేకుండ, అయ్యవారి నట్టిల్లు లాగ తయారు చేశారు. గత సంవత్సరం వెళ్ళి చూచేసరికి, జర్మనీ, యావత్తు, తిరిగి, కళకళలాడుతూ, pre-war industries production కన్నా, ఇప్పటికి, 25% అధికంగా, ఉత్పత్తిని, సాధించగలిగారు అంటె, ఆ ప్రజల కృషికి, ఆ ప్రభుత్వ కృషికి, మనము ఎంతైనా, విస్మయము జెందక తప్పదు. ప్రజలు, ప్రభుత్వము, యజమానులు, అందరూ కలపి, "ఇది మనదేశం, ఈ దేశాన్ని ఎలాగైనా పారిశ్రామికంగా ముందుకు తీసుకువొచ్చి, తిరిగి మన ప్రతిష్టను, మనం కాపాడుకోవాలని, ఒకే ఒక నిశ్చయంతో, అహోరాత్రాలు, పనిచేశారు కాబట్టే అక్కడ ఆవిధంగా పారిశ్రామిక విజయం సాధించగలిగారు. ఆలాంటి కృషినే, ఇక్కడ, మనము, మన ప్రభుత్వము, మన పరిశ్రమలలో, పెట్టగలిగిననాడు, మనం తప్పకుండా, వారివలెనే ముందుకు పోగలము. ఒక్క వ్యవసాయ రంగంలోనే కాకుండా, పారిశ్రామిక రంగంలో, ఏదేశం అయితే ముందంజవెయ్యదో, ఆదేశం ఎప్పటికీ, ముందుకు పోజాలదు

ఇది అందరికీ తెలిసిన సత్యమే. మన ప్రజలనుంచి పారిశ్రామిక అభివృద్ధి కోసం initiative వస్తుందా అని చూస్తే, ఇక్కడ ఏ విధమైనటువంటి initiative కనపడటం లేదు. డబ్బు మాత్రము చాలమంది చేతులలో ఉన్నది. ఆ డబ్బును పరిశ్రమలలో, పెట్టుబడి పెట్టడానికి వెనుకాడుతున్నారు. లక్ష్మీకాంతమ్మ గారు చెప్పినట్లు, "capital is shy." అది నిజమే. ఆ, shyness ను పోగొట్టి, ఈ డబ్బును తీసుకువొచ్చి, పరిశ్రమలలో పెట్టినచో, దేశానికి ఎక్కువ మేలును చేకూర్చిన వారవుతారు. అంతకన్నా patriotic act ఇంకేమీ ఉండదని మనవి చేస్తున్నాను.

ఎవరైనాసరే ఫ్యాక్టరీలు పెట్టేందుకు పూనుకుంటే ప్రభుత్వము ప్రతిబంధ కాలు ఏవీ పెట్టకుండా సర్వవిధముల సహకారము సత్వరంగా యిచ్చేటట్లయితే ఇంకా ఎక్కువ ఫ్యాక్టరీలు పెట్టడానికి అవకాశముంటుంది. "ఏ application పెట్టినా సరే జాప్య మౌతుంది. చాల ఇబ్బందులు తయారౌతున్నవి. Capitial Block అయిపో తుంది. ప్రభుత్వమునుంచి ఏవిధంగాకూడా ప్రజలకు encouragement వుండడము లేదు" అనిప్రజలంతాచెప్పుచున్నారు. ఆవిధంగాకాక ప్రభుత్వము సర్వవిధముల సహ కారము యిచ్చి పరిశ్రమలను ముందుకు తీసుకొచ్చేటట్లయితే యావన్మందికూడా బాగు పడతారని నేను మనవిచేస్తున్నాను. పరిశ్రమలలో కార్మికులకు భాగస్వామ్యము యివ్వ వలసిన అవసరాన్ని గురించి మొన్న త్రైపార్టీ కాన్ఫరెన్సు-ప్రభుత్వము, యజమానులు, కార్మికులు కలసి ఢిల్లీలో జరిగిన Indian Labour Conference లో ఒక ఒప్పం దము చేసుకున్నారు. దానిలో పరిశ్రమలలో కార్మికులకు భాగస్వామ్యము యివ్వాలనే సూత్రాన్ని ప్రభుత్వము గుర్తించినది. దానిని experimental గా కొన్ని పరిశ్రమ లలో ప్రవేశపెట్టడానికి అన్ని ప్రభుత్వాలుకూడా ఆమోదించాయి మద్రాస్ ప్రభుత్వము వారు ఆమోదించి వారి దగ్గరవున్న కొన్ని పరిశ్రమలలో అమలు చేయడానికి సిద్ధంగాకూడా వున్నారు. ఆంధ్ర ప్రభుత్వము ఇప్పటి వరకు అటువంటి scheme ను దేనిని తీసుకురాలేదు. త్వరగా తీసుకొస్తారని నేను ఆశిస్తున్నాను. పారిశ్రామిక శాంతి కోసము Indian Labour Conference లో జరిగిన ఒప్పందాన్ని ఆంధ్ర ప్రదేశ్ లో అమలు జరిపినట్లయితే ద్వితీయ పంచవర్షప్రణాళికకు కార్మికుల సహాయం పూర్తిగా లభిస్తుందని నేను హామీ యిస్తున్నాను. మొన్న కేరళలో జరిగిన ఎ. ఐ. టి. యు. సి. Conference లో అధి కమ్యూనిస్టులైనా, కార్మికులు ద్వితీయపంచవర్షప్రణాళికకు పూర్తిగా సహకార మివ్వాలని తీర్మానించినారు. ఐతే ప్రభు త్వము యజమానులు కూడా ఏ హామీలైతే యిచ్చారో వాటిని పూర్తిగా నిలబెట్టుకో వలసి వుంటుంది. ఆ proposals ను ఒక scheme రూపములో తెచ్చేటట్లయితే తప్పకుండా కార్మికులకు విశ్వాసము కలుగుతుంది. పారిశ్రామిక రంగములో అవిశ్వాసమనే మాటవుండకుండా పారిశ్రామిక విజయము సాధింపగలమనిచెప్పి ప్రభు త్వానికి మనవి చేస్తున్నాను. విశాఖ పట్టణములో ఉప్పు పరిశ్రమ ఎక్కువగా వుంది, ఈ ఉప్పు పరిశ్రమను నిజంగా అభివృద్ధి చేసేటట్లయితే వేలాది కార్మికులకు వృత్తి కలుగజేయడమే కాకుండా మన భారతదేశానికి కావలసిన chemicals అన్ని తయారౌతాయి. Soda Ash, caustic soda తయారు చేసే కర్మాగారమును పెట్ట వచ్చును అంతే కాకుండా by-products క్రింద Liquid Clorine, Hydro-Cloric Acid, D.D.T. ఇంకా ఇటువంటి insecticides' ను తయారు చేయ డానికి అవకాశాలున్నాయి. భారతదేశమ్ము వీటిని విదేశాలనుంచి చాల దిగుమతి,

చేసుకుంటున్నారు. దిగుమతిచేయడమువల్ల అనేక కోట్ల రూపాయలు పరాయి దేశాలకు పోతాయి. అంతేకాకుండా మన మందులకు 55 కోట్ల రూపాయలు ప్రతి సంవత్సరము విదేశాలకు యిస్తున్నాము. విదేశాలనుంచి కొనడము వల్ల foreign exchange drain విపరీతంగా వుంది. మనదేశంలోనే యీ మందులు తయారు చేసే కర్మాగారాలను ఎందుకు మనమే పెట్టుకోగూడదు ? ఈ డబ్బుతో ఎక్కడనైనా మందుల ఫ్యాక్టరీని పెట్టేట్లయితే బాగుంటుంది. పింప్రీ దగ్గిర మాత్రము ఒక చిన్న ఫ్యాక్టరీని పెట్టారు. మందులు తయారు చేసే కర్మాగారాలు పెట్టినట్లయితే నిజమైన అభివృద్ధికి దారి తీస్తుందని మనవి చేస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

శ్రీ షేక్‌మౌలాసాహెబ్ (ఉదయగిరి) :- అధ్యక్షా, మంత్రిగారు ప్రవేశ పెట్టిన యీ పరిశ్రమ డిమాండును బలపరుస్తూ వారికి కొన్ని సలహాలు యివ్వ దలచాను. ఇదివరకు యీ పరిశ్రమల డిమాండుపై ఎన్నో దఫాలు మాట్లాడినాను. తిరిగి ఇప్పుడుకూడా అవకాశము వచ్చింది. ధాన్యంధరలకు యీ పరిశ్రమకు సంబంధముంది. ధాన్యములధరలు పడిపోకుండ వుండాలంటే డబ్బు ఉత్పత్తికూడా వుండాలి. పరిశ్రమల ఉత్పత్తివల్ల డబ్బు ఉత్పత్తికూడా పెరుగుతుంది. డబ్బు లేదనే కారణంతో ప్రభుత్వము కొత్తపరిశ్రమలను నెలకొల్ప లేకపోతున్నది అని ముఖ్యమంత్రిగారు చెప్పినారు. ఇది నిజమేఅయితే దేశంలోవుండే దారిద్ర్యాన్ని పోగొట్టాలంటే నిరుద్యోగసమస్యను పరిష్కరించాలంటే, ప్రజానీకానికి పనులు కల్పించాలంటే పరిశ్రమలే ఆధారము. ఏదేశంలో చూచినా ఆ దేశదారిద్ర్యాని ఆ దేశంలోని పరిశ్రమలే పోగొట్టినాయి. ప్రభుత్వానికి పరిశ్రమలు జీవనాడుల వంటివి. అందుకై ప్రభుత్వము పరిశ్రమల విషయమై శ్రద్ధ తీసుకోవాలి. కొన్ని సందర్భములలో market down అయిందని అంటాము. మనదేశంలో తయారయ్యే పరకుమ వేరే దేశాలకు పంపవలసిన అవసరంలేదు. మనదేశంలో ఉత్పత్తిఅయ్యే పరకు మనదేశానికి చాలదు. ఈవరకు చాలక ఇతర దేశాలనుంచి తెప్పించుకుంటున్నాము. అటువంటపుడు ఏరకంగా నష్టంవస్తున్నదని అడుగుతాను. ఈ నష్టము రావడానికి కారణమేమిటి? ఎక్కడ ఈ లోపమున్నదో ఇంతవరకు గుర్తించలేకపోతున్నారు. నేను కొన్ని పరిశ్రమలు చూచాను. మద్రాసులో బకింగ్ హామ్ కర్నాటిక్ మిల్సు చూచాను. అక్కడవున్న లోపాలుకూడా కొంతమంది [illegible] అడిగి తెలుసుకొన్నాను. మన ఆంధ్రప్రదేశ్‌లో వున్న [illegible] మొత్తముమీద వున్న పరిశ్రమలతోపాటు పేరుపొందినవి. [illegible] నెల్లూరు మిల్లు ఐతేనేమి అల్యూమినియమ్‌ఫ్యాక్టరీ ఐతేనేమి [illegible] ముఖ్యమైనవి వున్నవి. ఈ పరిశ్రమలను నెలకొల్పడానికి

share capital పెట్టడానికి ఎవరూ ముందుకు రావడంలేదంటున్నారు. నిపుణులు కూడా లేరంటున్నారు. పరిశ్రమలు యీ విధంగా యీనాడు దెబ్బతిని పోతున్నాయి. ఉత్పత్తి అయ్యే సరకులకు రేటు ఫిక్స్ చేసే వారికిని, డీలర్సుకున్న indirect contact వుండడంబట్టి లక్షలకొలది నష్టాలు వస్తున్నవి.ఏపరిశ్రమలో నష్టము వచ్చినా ప్రభుత్వమే భరించాలి. తర్వాత దానిలో వచ్చిన లాభమునుంచి యీ నష్టమును recover చేసుకోవాలి. అందుచేత ప్రభుత్వానికి అండగా వుండేటటువంటి ధనవంతులుకూడా యీ పరిశ్రమలలో పెట్టుబడి పెట్టడానికి సందేహిస్తారు. ప్రభుత్వము అన్యాయంగా indirect పద్ధతులతో జాతీయము చేసుకోడానికి ఏదో కారణము చెప్పి వాండ్ల డబ్బంతా గాలికి ఎగిరిపోయేటట్లు చేసి యీ పరిశ్రమలను తీసుకున్నారని చెప్పి ప్రజలు నిందించడానికి కారణమౌతుంది. మున్ముందు పరిశ్రమలలో పెట్టుబడి పెట్టేవాండ్లుకూడా ముందుకురారు.అటువంటప్పుడు ప్రభుత్వ అధీనంలోవున్న పరిశ్రమలలో నష్టమురాకుండా చేయడానికి audit సక్రమంగా జరిపి నిపుణులను నియమించాలని మనవిచేస్తున్నాను.

మరొక విషయం ఏమంటే ఇపుడు మనం నెలకొల్పే పరిశ్రమలవల్ల తయారయే సరుకులు ఆంధ్రప్రదేశ్ అవసరాలకే చాలవు. ముఖ్యమైన పరిశ్రమలలో పెట్టుబడి పెట్టి ప్రజలకు జీవనాధారము కలిగిస్తున్నవారున్నారు. వారి పెట్టుబడులు, తెలివితేటలు, ధైర్య సాహసాలు దృష్టిలో పెట్టుకుని వారు దెబ్బతినకుండా వారి వాటా ధనం భద్రపరచడం ముఖ్యం. ప్రభుత్వంకూడా ఇటువంటి పరిశ్రమలలో పెట్టుబడి పెట్టి అభివృద్ధి చేసినయెడల ప్రభుత్వానికి ఆదాయం ఎక్కువవచ్చును. ఈ దేశదారిద్ర్య నిర్మూలనం జరుగును. ఈ విషయాలన్నింటిపై ముఖ్యమంత్రిగారు శ్రద్ధ వహించి ధైర్యసాహసాలతో ఈ కార్యక్రమాలన్నింటిలో జోక్యంకలిగించుకుంటారని ఆశిస్తున్నాను. నాకీఅవకాశం ఇచ్చినందుకు అధ్యక్షులవారికి వందనములర్పిస్తూ విరమిస్తున్నాను.

*శ్రీ ఎమ్. రాజేశ్వరరావు (దివి-రిజర్వుడు) :- అధ్యక్షా, ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో పారిశ్రామికాభివృద్ధికి చాల ప్రధానస్థానం ఇవ్వబడింది. ఈ ప్రణాళికా కాలంలో సుమారు 125 లక్షల మందికి ఉద్యోగావకాశాలు కల్పించాలనే ఉద్దేశంతోనే మొత్తం ప్రణాళికకోసము నిర్ణయించబడిన డబ్బులో దాదాపు నాలుగవ వంతు పరిశ్రమలకై కేటాయించబడినది. అందుచేత ద్వితీయ ప్రణాళికలో పరిశ్రమలయొక్క ఆధిక్యత ఏమిటో అందరికి స్పష్టంగా తెలిసినదే. కాని దురదృష్టం ఏమంటే మనరాష్ట్ర ప్రణాళికకు సంబంధించినంతవరకు 13 కోట్ల రూపాయలు మాత్రమే ద్వితీయ ప్రణాళికా కాలంలో కేటా యించారంటే కేంద్రప్రభుత్వం

ఏ ఉద్దేశంతో మొత్తం ప్రణాళికలో పరిశ్రమలకు అధికృత ఇచ్చారో ఆ ఉద్దేశాన్నే రాష్ట్ర ప్రభుత్వం నిర్లక్ష్యం చేస్తున్నదాఅనిపిస్తోంది. ఏమైనప్పటికి, ఇప్పటికి రెండు సంవత్సరాలే గడిచాయి, ఇకముందైనా ఈ gap ను పూర్తిచేయడానికి రాష్ట్రప్రభుత్వం ప్రయత్నిస్తుందని విశ్వసిస్తున్నాను, ముఖ్యమంత్రిగారు పెద్ద పరిశ్రమలను గురించి చెబుతూ ఇదివరకు ఉన్నపరిస్థితిని బాగుచేయడంకోసం చాలా ప్రయత్నం చేస్తున్నాంఅని చెప్పారు. అందులోనికి నేను వెళ్ళదలచుకోలేదు. చర్మ పరిశ్రమగురించి మాత్రం ఒకటి రెండు విషయాలు వారిదృష్టికి తీసుకురాదలచుకున్నాను. కుటీర పరిశ్రమలలో చర్మ పరిశ్రమ, చేనేత పరిశ్రమ తరువాత రెండవ స్థానం అలంకరిస్తుందని అందరికి తెలిసినదే. ద్వితీయ ప్రణాళికలో ఈ పరిశ్రమకోసం 6.1 కోటి రూపాయలు కేటాయించ బడినవి. ద్వితీయ ప్రణాళిక draft plan చూస్తే ఈనాడు భారతదేశానికి కావలసిన తోళ్ళ వస్తువులలో నూటికి 25 వంతులు కూడా మనం ఉత్పత్తి చేసుకోలేక పోతున్నాం అని స్పష్టంగా అందులో వివరించారు. తోళ్ళ వస్తువులు ఉత్పత్తి చేయడానికి కావలసిన వస్తుసామగ్రి (material) మనకు ఉన్నప్పటికి ప్రభుత్వ ప్రోత్సాహంలేని కారణంచేత నూటికి 25 వంతులుకూడా మనం ఉత్పత్తి చేసుకోలేక పోతున్నామని ప్రణాళికలో పేర్కొని 6.1 కోట్ల రూపాయలు కేటాయించారు. ఈ దృష్ట్యా మన రాష్ట్ర ప్రభుత్వ బడ్జెటును చూస్తే చాలా విచారం వేస్తుంది. ఈ విషయమై బడ్జెటులో రెండు heads మాత్రం, కుటీర పరిశ్రమల క్రింద 15 వేలు, సహకార సంఘాల క్రింద 80 వేలు కన్పిస్తున్నాయి. ఈ ఖర్చునుకూడా అఖిల భారత కుటీర, గ్రామ పరిశ్రమల బోర్డువారే భరిస్తున్నట్లు కనిపిస్తున్నది. వారు ఇచ్చే 250 లక్షల రూపాయలలో, ఈ రెండు మొత్తాలుకూడా ఇమిడి ఉన్నాయి. లఘు పరిశ్రమల (Small scale industries) క్రింద ఉత్పత్తి, శిక్షణా కేంద్రాలు (Production cum training centres) గానో తోళ్ళు పదును చేసే కేంద్రాలు గా నో (Model tanning industries) ఉన్న ఏలూరు, బెజవాడ, గుంతకల్లు, వరంగల్లు హైదరాబాదులలో అయిదు చోట్లు కలిపి 614 వేల రూపాయలు కేటాయించినట్లు కనిపిస్తోంది. ఇది రాష్ట్రప్రభుత్వానికి సంబంధించినది. అయితే 1956 57, 1957 58 బడ్జెటులను చూస్తే గత రెండు సంవత్సరాలుగా ఈ రకంగా కేటాయిస్తూనే ఉన్నట్లు తెలుస్తుంది. అయినా ఇంతవరకు ఆఫలాలు పెట్టడం మాత్రం జరుగలేదు. అందు కారణమే మళ్ళా ఈ బడ్జెటులో కేటాయించారేమోనని భావిస్తున్నాను. ఏలూరులోని కేంద్రం విషయమై రెండు సంవత్సరాల క్రితం 195 వేల రూపాయలు కేటాయించారు. [illegible] acquisition [illegible] జరుగలేదు అని వారే చెప్పారు. [illegible] కోసం కాని ఈ పరిశ్రమ,

ఇదివరకు పెట్టుబడిదారుల చేతులలో ఉండి ఇప్పుడు మూసివేయబడిన కారణంచేత నిరుద్యోగులైన వారికి తిరిగి ఉద్యోగాలు కల్పించే విషయంలో ప్రభుత్వం ఎంత ఆతురతగా ఉన్నదో స్పష్టంగా అర్థం అవుతూనేఉంది. ఈ విషయమై నేను ప్రభుత్వాన్ని విమర్శించదలచుకోలేదు. వారు ఏదో ఆరంభం చేయదలచుకున్నారు కాబట్టి ఈ సంవత్సరం కూడా చూస్తేనే తప్ప ఇదమిద్ధంగా ప్రభుత్వాన్ని నిందించడానికి అవకాశం లేదు. ఏమైనప్పటికి ఎంత తక్కువగా ఆరంభించినా, ఈ సంవత్సరమైనా ఈ స్కీమును ప్రారంభిస్తే చాలా సంతోషిస్తాను. చర్మ పరిశ్రమలో అనేక వేలమంది నిరుద్యోగులైపోయారు. ఏలూరు, రాజమండ్రి, విజయవాడ ప్రాంతాలలో ఇదివరకు వేసిన లెక్క ప్రకారం 45 వేల మంది నిరుద్యోగులైనట్లు కనిపిస్తోంది. చర్మపరిశ్రమలో ఇదివరకున్న మహమ్మదీయులు—లబ్బీలు—మూసివేసిన కారణంచేత ఈ పెద్దపరిశ్రమను నడిపే తాహతు చర్మ కారకులకు లేని కారణంచేత వారందరు నిరుద్యోగులై నీచమైన వృత్తులకు పాల్పడి కనీస జీవనానికి కూడా సంపాదించుకోలేని స్థితికి దిగజారడం ప్రభుత్వ దృష్టికి తెచ్చాము. అదృష్టవశాత్తు ఈ రోజున అఖిలభారత కుటీర, గ్రామ పరిశ్రమల బోర్డువారు కుటీర పరిశ్రమలేవైనా స్థాపిస్తే తగుసహాయం ఇస్తామని అందుకు తగ్గ ప్రణాళికనామోదించారు. అయితే రాష్ట్రప్రభుత్వం ఎలాంటి శ్రద్ధ తీసుకుంటున్నట్లు కన్పించదు. 1956 57వ సంవత్సరంలో అనేక సంఘాలను పెట్టి అఖిలభారత కుటీర, గ్రామపరిశ్రమలబోర్డు వారికి పంపిస్తే. మేము మంజూరు చేస్తాము; మీ రాష్ట్రబోర్డు ద్వారా పంపండి అని అన్నారు. కొంత కాలం పరిశ్రమల డైరక్టరు ద్వారా పంపిస్తే రాష్ట్ర బోర్డు ద్వారా రావాలని అన్నారు. ఇక్కడ అటువంటి బోర్డు లేదు. హైదరాబాదు రాష్ట్రంలో ఉండేది; దానిని పునర్నిర్మిస్తున్నాము (reconstitute) అన్నారు. ఇంతవరకు పునర్నిర్మించబడలేదు. ఈమధ్య వి ఎల్. మెహతాగారు వచ్చినపుడు ఏదో ఒప్పందం కుదిరిందని విన్నాము. బోర్డును నిర్మించేవరకు బోర్డు స్థానే ప్రభుత్వమే ఈ బాధ్యత వహిస్తుందని అన్నట్లు ఒప్పందం అని వింటున్నాము. ఆవిధంగా చేసినా సంతోషించవలసిన విషయమే. గమనించవలసిన విషయం మరొకటి ఉన్నది. అఖిలభారత బోర్డువారు అనేక సంఘాలకు డబ్బు ఇచ్చారు, ఆ డబ్బును కూడా వినియోగించుకోడానికి అవకాశం లేకుండా పోతున్నదని బాధపడుతున్నాము. సహకార పద్ధతిమీద ఈ డబ్బును ఇచ్చినట్లయితే దీనిపై తనిఖీ (inspection) చేయడానికి రాష్ట్రప్రభుత్వ ఇనస్పెక్టర్లు కావలసివస్తున్నారు. డిప్యూటీ రిజిస్ట్రారును అడిగితే staff లేరు; బడ్జెటులో కేటాయించలేదు అంటున్నారు. డబ్బు బ్యాంకులలో వేసుకోడం తప్ప ఖర్చుపెట్టడానికి అవకాశం లేకపోతోంది. రిజిస్టర్డు సంఘాలున్నాయి. పరిశ్రమల డిపార్టు

మెంటు వారు ఇనస్పెక్టర్లను వేసే తాహతు లేకపోవడంమూలంగా డబ్బు ఖర్చు పెట్టడానికి అలాగే ఉంచిపోతోంది. రాష్ట్ర ప్రభుత్వంవారు సహాయంచేసినా చేయక పోయినా, అఖిలభారత బోర్డువారు ఇచ్చిన లక్ష రూపాయలడబ్బును కొన్ని వేల రూపాయిల ఖర్చుతో అవసరమైన సాంకేతిక సిబ్బందిని (technical staff) రాష్ట్ర ప్రభుత్వం ఇవ్వని కారణంగా ఉపయోగించుకోలేకపోతున్నాము. ప్రభుత్వంవారు రాష్ట్రబోర్డును ఏర్పాటుచేసినా చేయకపోయినా, ఒక ఒప్పందం చేసుకున్నారని తెలుస్తున్నది. కాబట్టి, బోర్డువారు ఇచ్చేడబ్బునైనా ఉపయోగించు కోడానికి వీలుగా సాంకేతిక సిబ్బందినైనా ఇస్తారని భావిస్తున్నాను. ఇది హరిజనా భ్యుదయానికి సంబంధించిన డిమాండు కాకపోయినా, హరిజనులను గురించి ఒక విషయం చెప్పదలచుకున్నాము. ఎన్నో శాస్త్రాలు చెబుతుంటారు: అస్పృశ్యత పోవాలి; segregation పోవాలి అంటుంటారు. హరిజనులు స్వతఃసిద్ధంగా బ్రతికితేనే శ్రేయోరాజ్యం, సామ్యవాద సమాజస్థాపన జరుగుతుంది అంటుంటారు. హరిజనాభ్యుదయం క్రింద ఏర్పాటు చేసే ప్రణాళికలలో వారి వృత్తులకు ప్రోత్సాహం కల్పించే పరిశ్రమలను స్థాపించుట ద్వారా ఈ సమస్య పరిష్కారం అవుతుందేమో అనుకుంటున్నాను. శ్రీ భగవంతరావుగారు మంత్రిగాఉన్నారు. వారు నేను కలిసి ప్రభుత్వం ఏర్పాటుచేసిన సంఘంలో సభ్యులుగా ఉన్నాము. హరిజనులను ఇతర పేదతరగతులకు చెందినవారిని పైకి తీసుకురావడానికి వారు ఏవేవో పరిశ్రమలను సూచించారు. అవన్నీ అందులో వ్రాశాము; సిఫార్సుచేశాము, ఆ రిపోర్టును చూసినట్లే లేదు. అవేవో నెలకొల్పడానికి ప్రభుత్వం కృషి చేస్తున్నట్లుకాని కనీసం ప్రయత్నం చేస్తున్నట్లు కాని కన్పించడం లేదు. వారు మంత్రిగా అయి కొద్ది కాలమే అయింది. వారు ఈ అవకాశాన్ని తీసుకుని, ఏ పరిశ్రమలవల్లనైతే వీరి స్థితిగతులు అభివృద్ధి చెందుతాయి అని వారు ఇదివరలో సిఫార్సు చేసినారో వాటి నన్నింటిని డిపార్టుమెంటుచేత పరిశీలన చేయించి అమలు చేయించడానికి గల అవ కాశాలను చూడాలని విజ్ఞప్తి చేస్తున్నాను. ఈవిధంగా హరిజనులకు తదితర వెనుక బడిన వర్గాలకు, చేనేత పారిశ్రామికులకు చేసిన సదుపాయం మాదిరిగా ఆయా వృత్తుల వారికి పరిశ్రమలను నెలకొల్పినట్లయితే, మిగతా చట్టాలు ఏవిధంగా ఉన్నా, వీటి ద్వారా హరిజనులు, తదితర వెనుకబడిన వర్గాలవారు స్వతఃసిద్ధమైన జీవనోపాధి కల్పించుకోడానికి అవకాశం కలుగుతుంది. Segregation కూడా తొలగించడానికి అవకాశం ఉంటుంది.

పరిశ్రమలను జాతీయం చేయవలెనని, చాలామంది చెబుతున్నారు. దీనిని గురించి ఎవరికీ ఎటువంటి భేదాభిప్రాయాలు లేవు. మొదటినుంచీ భారీ పరిశ్రమలను

జాతీయం చేయవలెననేదే మనందరి అభిప్రాయం. ఐతే నేషనలైజేషన్ వల్ల వచ్చే ఉపయోగములేవో మనకు స్పష్టంగా తెలియవు. ఎక్కడో రష్యాలో వాటి ఫలితాలను గురించి తెలిసికోడానికి అవకాశమున్నదేమో గాని మనకు అట్టివి అంతగా లేవు. ఐతే ఆంధ్రరాష్ట్రంలో ఇందుకు కొంత అవకాశం కలిగింది. గత సంవత్సరం పరిశ్రమల డిమాండ్ మీద మాట్లాడుతు శ్రీ సంజీవరెడ్డిగారు కొన్ని వివరాలను తెలియజేశారు. వాటిని బట్టి నిజామ్ షుగర్ ఫ్యాక్టరీలో తప్ప తక్కిన పరిశ్రమలలో నష్టమే వస్తున్నట్లు వారు చెప్పారు. ప్రభుత్వ పరిశ్రమలు ఈవిధంగా నిర్వహింపబడు తున్నప్పుడు, జాతీయంవల్ల దేశం ఎంతవరకు లాభపడుతుందనే విషయం గమనించ వలసిఉంది. దీనిని గురించి ప్రభుత్వం జాగ్రత్తగా ఆలోచించాలి. పరిశ్రమలను జాతీయం చేయడమా? చేస్తే ఏవిధంగా నడపాలి, వాటిని effective manner లో అభివృద్ధి పరచడానికి అవకాశమున్నదా ? అనే విషయాలను గూర్చి ఆలోచించాలి. వీటిని పరిశీలించి బాగోగులను తెలుసుకొనేవరకు, జాతీయాన్ని ఆపుచేయాలి. మేనే జింగ్ ఏజెన్సీల గురించి శ్రీ శ్రీరామమూర్తిగారు చెప్పారు. వారు చెప్పినదానితో ఏకీభవించక తప్పదు మనకు ఒక industrial corporation ను ఎందుకు ఏర్పాటు చేయకూడదని అడుగుతున్నాను. భారతప్రభుత్వంగూడ ఇటువంటి corporation ను ఏర్పాటు చేసింది. అటువంటి దానిని మన ప్రభుత్వం ఏర్పాటుచేసి managing Agencies క్రింద ఉన్న సంస్థలను ఈ కార్పొరేషన్ ఆధ్వర్యము క్రిందకు తెచ్చిన ఉపయోగముంటుందేమో ఆలోచించవలెనని కోరుతున్నాను. అట్టి పరిస్థితులు లేక పోయినట్లయితే అందరముకూడ ఏక కంఠముతో ఈ జాతీయం పద్ధతి వద్దని, ఈ డబ్బు దుర్వినియోగాన్ని ఆపుచేయమని చెప్పే పరిస్థితి ఏర్పడుతుంది. ఏ సిద్ధాంతాలకు మన మింతవరకు కట్టుబడినామో ఆ సిద్ధాంతాలనే వెనుకకు నెట్టినవాళ్లము అవుతాము అనుకుంటున్నాను. ముఖ్యమంత్రిగారు, పరిశ్రమల శాఖను నిర్వహిస్తున్నందుకు వారిని అభినందిస్తున్నాను. పరిశ్రమలను జాతీయం చేసే విషయంలో మనం జాగ్రత్తగా పరిశీలనచేయకపోయినట్లయితే ప్రజల డబ్బును దుర్వినియోగం చేశామనే నేరం మన మీదఉంటుందని భావిస్తున్నాను. చర్మకారులకు తదితర హరిజనులకు స్వయం పోషక మైన వృత్తి కల్పించటానికి కుటీర పరిశ్రమలు ఎక్కడెక్కడ ఉన్నవో వాటిని అభి వృద్ధి చేయుటెట్లో ప్రభుత్వం శ్రద్ధగా ఆలోచించవలెనని కోరుతూ సెలవు తీసి కొంటున్నాను.

శ్రీ కె. రాజమల్లు (సిరిపూర్-జనరల్): అధ్యక్షా : తెలంగాణా ప్రాంతములో ఉన్న పరిశ్రమలలో సింగరేణి కాలరీస్ చాలపెద్ద పరిశ్రమ. కొత్తగూడెం ప్రాంతము లో 12 వేల మంది కార్మికులు పనిచేస్తున్నారు. దానికి సంబంధించిన బ్రాంచి

కాలరీలలో 6 వేల మందిదాకా పనిచేస్తున్నారు. ఈకంపెనీలలో ప్రభుత్వానికి 88% షేర్లు ఉన్నప్పటికీగూడ మన బడ్జెట్‌లో ఏమీ కేటాయించలేదు. అప్పు ఇవ్వలేదు. ఏఉద్దేశ్యముతో పరిశ్రమలను అభివృద్ధి చేయదలచుకున్నామో ఆ ఉద్దేశ్యములను మనము విడనాడగూడదు. ఇప్పుడున్న సింగరేణి కాలరీల యాజమాన్యం చాల సామర్థ్యంగలది. వారు చాలచురుకుగా పనిచేస్తున్నారు. చాల ఎఫీషెంట్ టెక్నీషియన్స్ ఉన్నారు. వారికి తగిన ఆర్థికసహాయం చేసినట్లైతే కొత్త pits ను open చేయగలరు. అందువలన నాల్గు, ఐదు వేలమందికి అదనంగా పనిదొరుకుతుంది, ఐతే ఈగనులలోని పనివిషయంకూడ భారీ యంత్రసామాగ్రిని ఉపయోగించే ప్రయత్నాలు జరుగుతున్నవి. కార్మికులు చేసేపనిని యంత్రాలద్వారా చేయించుటవల్ల కార్మికులకు వృత్తిపోతుంది. అందువల్ల పూర్వంవలెనే కోల్‌కటింగ్ విధానాన్ని అమలు చేయించవలెనని కోరుతున్నాను. మనరాష్ట్రంలో స్మాల్ స్కేల్ ఇండస్ట్రీస్ ఏర్పాటుచేయాలి. ఎక్కువ మందికి పనికల్పించే విధానాన్ని మనం అమలుపరచాలి భారీయంత్రసామాగ్రినిమిత్తం ఫారిన్‌ఎక్స్చేంజిని అనవసరంగా వ్యయపరచకుండా కోల్ కటింగ్ పద్ధతిని అనుసరించవలెనని ముఖ్యమంత్రిగారు సలహా ఇచ్చినట్లైతే సింగరేణి కాలరీస్‌లోని ఎక్కువమంది కార్మికులకు వృత్తికలుగచేసిన వాళ్ళమవుతాము. కొత్తగూడెం, తాండూర్, కాలరీస్‌లో నాలుగు కొత్త pits ను ఓపెన్ చేసినట్లయితే ఇంకా 7, 8 వేలమందికి పనిదొరుకుతుంది. రాష్ట్ర ప్రభుత్వం, కేంద్ర ప్రభుత్వం ఈ పరిశ్రమకు ఆర్థిక సహాయం చేయవలెనని కోరుతూ ముగిస్తున్నాను.

*శ్రీ బి. రత్నసభాపతి (బద్వేల్) :- అధ్యక్షా, గత సంవత్సరం బడ్జెట్ సమావేశంలో ముఖ్యమంత్రిగారు ప్రభుత్వ యాజమాన్యం క్రింద ఉన్న పరిశ్రమల గురించి ఒక సమగ్రమైన నోట్‌ను ఇచ్చారు. దానిలో హైద్రాబాద్‌రాష్ట్రంలో ఉండినటువంటి పరిశ్రమలన్నింటినీ గూర్చి తెలియజేశారు. ఆనాటి హైద్రాబాద్ రాష్ట్రములో గల పరిశ్రమలలో కొన్ని Mysore రాష్ట్రానికి, కొన్ని Bombay కి రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ వల్ల దఖలు పరచబడినవి. ఈ పరిశ్రమలలో ఆంధ్ర ప్రదేశ్‌కు ఉన్న భాగమెంత, ఇతర ప్రభుత్వాలకున్న భాగమెంత అనే వివరాలు తెలియజేస్తామని అప్పట్లో ముఖ్యమంత్రిగారు చెప్పారు. అటువంటి సమాచారం ముఖ్యమంత్రిగారు సేకరించారా అని అడుగుతున్నాను. వెనుకటి హైద్రాబాద్ ప్రభుత్వానికి చెందిన పరిశ్రమలు ఈనాటి ఆంధ్ర, మైసూర్, బొంబాయి, ప్రభుత్వాల మధ్యన ఏవిధంగా విభజింపబడినవో (Bifurcation) ఇప్పుడైనను తెలియజేయవలెనని ముఖ్యమంత్రిగారిని కోరుతున్నాను. గత సంవత్సరం మనకు ఇచ్చిన నోట్‌ను

బట్టి ఇండస్ట్రియల్ ఫండ్ నుంచికాని, ఫైనాన్స్ డిపార్ట్‌మెంట్ నుంచికాని, మొత్తం 922 లక్షల రూపాయలు రాష్ట్రంలోని పరిశ్రమలకు ఇయ్యబడినదని ఉన్నది. ఈ మొత్తంలో ఇండస్ట్రియల్ ఫండ్ నుంచి 164 లక్షలు, ఫైనాన్స్ శాఖనుంచి 758 లక్షలు ఇవ్వబడినట్లు పేర్కొన్నారు. ఈ డబ్బంతా 39 పరిశ్రమలకు ఇవ్వబడింది. వీటిలో17 మన రాష్ట్రానికి వెలుపల, తక్కినవి తెలంగాణాప్రాంతములోను ఉన్నవని చెప్పారు. ఆంధ్ర ప్రాంతానికి చెందినంతవరకు హేమలతా టెక్స్‌టైల్స్ అనే కంపెనీకి కొంత అప్పు ఇచ్చారు. ఈ కంపెనీవారు ఇంతవరకు ఎన్ని వంతులు చెల్లించినది తెలియచేయగోర్తాను. హైద్రాబాద్ ఫైనాన్స్ కార్పొరేషన్ వారు, జడ్చర్లలోని ఆయిల్ మిల్లులకు కొన్ని లక్షల రూపాయలు అప్పుగా ఇచ్చారు. ఈ ఆయిల్ మిల్లుల యజమాని, నారాయణ్‌దాస్ డాగా అనే కాంగ్రెస్ వ్యక్తి, రాజ్యసభ మెంబరుకూడా. స్టేట్‌బ్యాంక్ ఆఫ్ ఇండియా వారుకూడా కొంతవరకు ఈ కంపెనీకి అప్పు ఇచ్చారు. 4, 3, లక్షల రూపాయలవరకు ఎట్టి సెక్యూరిటీ లేకుండా అప్పు ఇచ్చినట్లు తెలుస్తోంది ఇచ్చిన డబ్బు తిరిగి వస్తుందో లేదో చూచుకోకుండా ఎట్టి సెక్యూరిటీ లేకుండా అప్పు ఎందువల్ల ఇయ్యబడిందో ముఖ్యమంత్రిగారు తెలియజేయవలెనని కోరుతున్నాను. స్టేట్‌బ్యాంక్ వ్యవహారాలను విమర్శిస్తూ, "నవశక్తి" కొన్ని వార్తలను ప్రచురించింది . హైద్రాబాద్ లోను, జిల్లాలలోనుకూడా కొంత గందరగోళం జరిగింది. దీనిని గురించి స్టేట్‌బ్యాంక్ వారిని అడగాలి. "నిజంగా వారు అప్పు ఇచ్చారా, ఆ యిచ్చిన అప్పుకు సెక్యూరిటీ ఉన్నదా" అనే విషయాలు శ్రద్ధగా పరిశీలించాలి. నేను చీఫ్‌మినిస్టర్ గారికి, 11 వ తారీకున ఒక ఉత్తరం వ్రాశాను. మనరాష్ట్రంలోవున్న ప్రభుత్వపరిశ్రమలయొక్క బ్యాలన్స్‌షీట్స్ సప్లయిచేయమని కోరినాను. వారి సెక్రెటరీగారు నాకు ఒక నోటు పంపించారు. కాని ఆనోటును నేను సంపూర్ణంగా చదివినతరువాతకూడా, ఈ పరిశ్రమల పరిస్థితులగురించి మొదట నాకు తెలిసినదానికంటే ఎక్కువ ఏమీ తెలుసుకునే అవకాశంలేకపోయినది. ఈ పరిశ్రమలలో మేనేజింగ్ ఏజంట్సు పెద్దపెద్ద షాహుకార్లు, పెట్టుబడిదార్లు ఉన్నారు. వాళ్లకుతంత్రములు చాలా ఉన్నవి, అవి అందరికితెలుసు. ఈ పరిశ్రమలు యింత అధ్వాన్న పరిస్థితులలోకి రావడానికి వారేకారణమని చీఫ్‌మినిస్టరుగారు అంగీకరించారు. కనుక ఈ స్టేటుమెంటు ఏమి లాభం ? వివరంగా అన్నివిషయాలు లోతుపాతులతో బయటపడితే సభ్యులు సలహాలు యివ్వడానికి అవకాశంఉండేది. కాని అటువంటి వివరాలు ఏమీ ఇవ్వలేదు. వారు యిచ్చిన స్టేటుమెంటు, నిరుడు సంవత్సరం యిచ్చిన నోటు—వీటిని బట్టి నేను ఒక స్టేటుమెంటు తయారుచేశాను. అది మీద్వారా చీఫ్‌మినిస్టరుగారికి అందజేసుకోవాలనుకుంటున్నాను, నేను యిప్పుడు మాట్లాడే విషయాలు దానిమీద ఆధారపడి వుంటాయి.

ప్రాగాటూల్సు కార్పొరేషన్ 43వ సంవత్సరంలో పెట్టారు. కొంతకాలం నష్టం వచ్చింది. ఈ సంవత్సరం కొంతలాభంవచ్చే పరిస్థితులలో పడ్డామని చీఫ్ మినిస్టరుగారు చెప్పారు. ఆసియా మొత్తంలో యింత పెద్ద పరిశ్రమలేదనే ప్రశంస వచ్చింది. ఇందులో ప్రభుత్వానికి 61 పర్సెంటు షేర్సు ఉన్నాయి. లాభంకూడా వస్తోంది. అటువంటప్పుడు దీనిని భారత ప్రభుత్వానికి యివ్వవలసిన అవసరమేమున్నదని అడుగుతున్నాను. దీనిని ఎక్స్పాన్షన్‌చేయడానికి డబ్బు లేదని అన్నారు ఈ సందర్భంలో చీఫ్‌మినిస్టరుగారిని ఒక ప్రశ్న అడుగుతున్నాను. ఇక్కడ బిర్లాస్ మేనేజ్‌మెంట్ క్రింద ఉన్న పరిశ్రమలు చాలా ఉన్నవి. ముఖ్యంగా సిర్‌సిల్క్, సిర్పూర్‌మిల్సు వారి మేనేజ్‌మెంట్ క్రింద ఉన్నవి. చాలా లాభాలు సంపాదించుకొంటున్నారు. ఆ రెండు పరిశ్రమలకు యీ ప్రభుత్వం అప్పుయిచ్చింది. సిర్‌సిల్కుకు రు 3 కోట్ల 24 లక్షలు, సిర్పూర్ మిల్సుకు రు. 1 కోటి 2 లక్షలు అప్పులు యిచ్చారు. తమ ఆస్తిపాస్తులతో స్వంతంగా పరిశ్రమలను నడుపుకొనగల శక్తి ఉన్నవారికి, పెద్ద పెట్టుబడిదారులైన బిర్లాస్‌కు నాలుగున్నర కోట్ల రూపాయలు యీ ప్రభుత్వం అప్పు యిచ్చింది. కాని మన చేతులలో ఉన్న ప్రాగాటూల్సుకు, దానిని పెంపుచేసి ఎక్కువ లాభము సంపాదించడానికి అవకాశమున్న పరిశ్రమకు—ఈ పెట్టుబడి మన ప్రభుత్వం ఎందుకు పెట్టకూడదు? బిర్లాస్‌నుంచి మన డబ్బు తీసుకొనకూడదా? ఈ రోజున నైజామువద్ద వందలకోట్లు ఉన్నాయి. ఆయనకూ, ప్రభుత్వమునకూ సన్నిహిత సంబంధములున్నవి. ఆయనవద్దనుంచి ఖచ్చితంగా ప్రభుత్వం అప్పు తీసుకొనుటకు అవకాశం ఉన్నది. ఆయన షేర్సుకొని పెట్టుబడిపెట్టవచ్చును. ఆయన బిర్లాసుకు కొన్ని కోట్లు అప్పు యిచ్చాడు. మన క్రెడిట్‌వర్దీనేస్ బిర్లాస్‌కంటే ఎక్కువే ఉన్నదికదా? ఆయన మన ప్రభుత్వమునకు మాత్రం ఎందుకు అప్పు యివ్వడు? కనుక డబ్బు లేదనేకారణంతో ప్రాగాటూల్సును కేంద్ర ప్రభుత్వానికి యివ్వడం సమంజసం కాదని చెబుతున్నాను. కేంద్రప్రభుత్వం అప్పు యివ్వక పోయినా, బిర్లాస్‌నుంచి మన డబ్బు వెనక్కు తీసుకొనవచ్చును. తరువాత నైజామ్ నుంచికూడా ప్రభుత్వం అప్పు తీసుకొనుటకు అవకాశం ఉన్నదని మనవి చేస్తున్నాను.

నైజామ్ షుగర్ ఫ్యాక్టరీని గురించి సంజీవరెడ్డిగారు చాలా చెప్పారు. పోయిన సంవత్సరముకు, యీ సంవత్సరముకు ఏమీతేడా కనిపించలేదు. వారి ఉపన్యాసములో గాని, సెక్రటరీగారు అందజేసిన స్టేటుమెంటులో గాని, ఈ సంవత్సరం ఆ ఫ్యాక్టరీకి ఎంత లాభమువచ్చినదో చెప్పలేకపోయారు. పోయిన సంవత్సరముకు, ఈ సంవత్సరముకు మేనేజిమెంటులో ఏమైనా అభివృద్ధి కలిగిందా—అనే విషయమై

ఒక నిర్ణయానికి రాలేకుండాఉన్నాము. ఈ ఫ్యాక్టరీని 1937వ సంవత్సరంలో పెట్టారు. ఆ ఫ్యాక్టరీ పేరు విన్నంత మాత్రాన ప్రతివారికీ తట్టేది ఏమంటే-This is a monument of corruption inefficiancy, bribery and nepotism అని అనిపిస్తుంది. దీనివల్ల ఆ ఇండస్ట్రీకి ఏమీలాభం లేకుండా ఉన్నది. గవర్న మెంటు షేర్సు పెట్టిన ఈ పరిశ్రమను యింకా అభివృద్ధి చేయడానికి ఏమీ చేయుట లేదు. సంజీవరెడ్డిగారు చెబుతూ, మన operating director ను అందులో వేస్తా మని, అది బాగుపడుతుందని అన్నారు. అక్కడ చెరకుపంటకు భూమిని సాగు చేసే టైములో, ఎక్కువ ఎరువులుపెట్టి పంట పండించే అవకాశం కలుగజేయాలి. ఇంతవరకు జరుగుతున్న దోపిడీని, లంచగొండితనాన్ని యీ ప్రభుత్వం రూపు మాప గలిగితే, అక్కడ ఎక్కువలాభం ఉంటుంది. లేకపోతే పెట్టుబడి పెట్టినదానికి ఏమీ లాభం ఉండదని మనవి చేస్తున్నాను. అక్కడ ఏవిధంగా లాభం తీయడానికి అవకాశం ఉన్నదో చెబుతున్నాను. బొంబాయి రాష్ట్రంలో బెల్లాపూర్ షుగర్ ఫ్యాక్టరీ ఉన్నది. దాని కెపాసిటీ వెయ్యి టన్నులు. మన నిజామ్ షుగర్ ఫ్యాక్ట రీకి 3,200 టన్నులు.

| | | | |
|---|---|---|---|
| 1953లో | బెల్లాపూర్ షుగర్ ఫ్యాక్టరీకి | రు. | 29,55,000 |
| | నిజామ్ షుగర్ ఫ్యాక్టరీకి | | 41,43,000 |
| 1954లో | బెల్లాపూర్ | | 34,00,000 |
| | నిజామ్ షుగర్ ఫ్యాక్టరీకి | | 40,00,000 చిల్లర |
| 1956లో | బెల్లాపూర్ | | 36,49,000 |
| | నిజామ్ షుగర్ ఫ్యాక్టరీకి | | 42,65,000లు వచ్చినది. |

నిజామ్ షుగర్ ఫ్యాక్టరీ పెట్టుబడి రు. 1,45,00,000 లు. బెల్లాపూర్ ఫ్యాక్ట రీకి రు. 46,00,000లు మాత్రమే. ఎక్కువ పెట్టుబడి ఉండి, ఎక్కువ crushing capacity ఉన్న నిజామ్ షుగర్ ఫ్యాక్టరీకి—లాభాలలో యింత తేడా రావడానికి కారణమేమిటని తెలుసుకొనే ప్రయత్నం చేశారా అని ముఖ్యమంత్రిగారిని అడుగు తున్నాను. ఈ ఫ్యాక్టరీకి ఎంతమంది చిన్నచిన్న షేరు హోల్డర్సు డబ్బుకట్టినారో తెలియదు గాని యిది కేవలము కొద్దిమంది వ్యక్తులకు మాత్రమే—ఎక్కువ డబ్బు ఉండి అధికారము చెలాయించేవారికి—యిది ఉపయోగపడుతున్నది. 1955-56 ఎలెక్షన్సులో ఒక విచిత్ర సంఘటన జరిగింది. ఈ ఫ్యాక్టరీకి మేనేజింగ్ డైరెక్టరుగా ఉన్న ఖాన్ బహదూర్ అబ్దుల్ కరీమ్ బాబూఖాన్ ఒక లక్ష రూపాయలు ఎలెక్షన్ ఫండుకు యిచ్చారు. అది రుజావు చేయగలను. ఆ చెక్కుబుక్కులో 20 మందికి ఒక్కొక్కరికి అయిదువేల రూపాయలచొప్పున 20 చెక్కులు issue చేశారు. ఇది

ముఖ్యమంత్రిగారి దృష్టికి వచ్చిఉంటుందనుకుంటాను. ఈ కంపెనీకి వచ్చేలాభాలు ఒక పార్టీకి గాని, ఏ సంఘాలకు గాని యివ్వకూడదా అంటే యివ్వవచ్చును. దానికి ఒక procedure ఉన్నది. Company law ప్రకారం కొంత మొత్తమునకు పైబడి మేనేజింగ్ డైరెక్టరు యివ్వదలచుకుంటే, గవర్నమెంట్ డైరెక్టరు కౌంటర్ సైన్ చేసేవరకు యివ్వకూడదు. అటువంటి కౌంటర్ సైన్ గవర్నమెంటు డైరెక్టరు చేశాడా ? ఆ విషయం వారికి తెలుసా అని అడుతున్నాను. గవర్నమెంట్ డైరెక్టర్సుగా ఉన్నవారు - దామోదరరెడ్డిగారు, ఆర్. ప్రసాద్‌గారు, విద్యాసాగర్‌గారు యింకా ఒకరిద్దరు ఉండవచ్చును. ఆవిషయం మీకుతెలుసునా ? తెలియకుండా జరిగినదా ? ఈ factory లో 72% గవర్నమెంటు షేర్సు ఉన్నవి. ఆ లక్ష రూపాయలలో రు. 72 వేలు కాంగ్రెసుపార్టీ ఎలెక్షన్సుకు పోయింది, అది కాంగ్రెసు ప్రతినిధులు ఉపయోగించుకొన్నారని రుజువు చేయగలను. మంత్రివర్గములో ఉన్నవారే కొంతమంది తీసుకొన్నారు. వారిపేర్లు - కనీసం ఇప్పుడు ఉన్నవారి పేర్లు సంజీవరెడ్డిగారు చెప్పకపోయినా, వెళ్లిపోయినవారిపేర్లు చెప్పగలుగుతారని ఆశిస్తున్నాను. ఈ ఫ్యాక్టరీకి సంబంధించిన blue-prints చూస్తే అక్కడ కొన్ని ఇండ్లు ఉన్నట్లు వ్రాశారు. అక్కడకుపోయి చూస్తే అటువంటివేమీలేవు ఆ ఇండ్లను కట్టనేలేదా ? డబ్బు ఖర్చుపెట్టినట్లు లెక్కలలో వ్రాశారా ? అది తెలుసుకోమని చెబుతున్నాను. అక్కడ భూములు ఉన్నవి. గవర్నమెంటుకు సంబంధించి 16 వేల ఎకరాలు ఉన్నవి. చెరుకు పండిస్తారు. ఈ భూములలో ఎకరానికి ఎంత పండించగలుగుతున్నారు ? ఆ ప్రక్కనే ఎక్స్ - మినిస్టర్ల భూములు ఉన్నాయి. వాళ్ల భూములలో ఎకరానికి ఎంతఫలితము వస్తోంది? ఈ భూములలో ఎరువులు తక్కువ వేస్తున్నారా? ఖర్చు తక్కువ పెట్టుతున్నారా ? - ప్రక్కవాటితో పోల్చిచెప్పమని ముఖ్యమంత్రిగారిని అడుగుతున్నాను.

ఈ భూములలో సత్తువచేయటానికి ఎరువులు తీసుకొంటారు. కొందరు ఎరువులు ఆ భూములకు వేయకుండా, అమ్ముకొని డబ్బు చేసుకొంటున్నారని ఒక వాడుక వచ్చింది. అది నిజంకాదంటే నేను సంతోషిస్తాను. అదే నిజమైతే, దానికి తగిన చర్యలు తీసుకోవాలని ముఖ్యమంత్రిగారికి తెలియజేస్తున్నాను. ఆంధ్రప్రదేశ్‌లో ఉన్నటువంటి పరిశ్రమలన్నీ మనం ఒకతూరి సింహావలోకనం చేసిచూస్తే ఒక సంగతి బోధపడుతుంది. ప్రభుత్వం ఎక్కువ పెట్టుబడి పెట్టిన పరిశ్రమలన్నీ బిర్లా చేతుల్లోకి పోయాయి. బిర్లా ఆంధ్రప్రదేశ్‌లో ఆర్థికవ్యవస్థలో ఒక సామ్రాజ్యాన్ని ఏర్పరచారు. ప్రభుత్వం 9 కోట్ల 37 లక్షల రూపాయలు పెట్టుబడిపెట్టగా, అందులో బిర్లా అజ్మాయిషీలో ఉన్న పరిశ్రమలకు ఆరు కోట్ల రూపాయలు పెట్టుబడి పెట్టటం

జరిగింది. ప్రభుత్వం పెట్టుబడిపెట్టిన డబ్బులో 6 కోట్ల రూపాయల ప్రభుత్వం డబ్బును బిర్లా ఈ రోజు వినియోగించుకొంటున్నాడు. భారతప్రభుత్వం ఎకనమిక్ పాలసీలో చేసినటువంటి సూచనలు, కాన్‌స్టిట్యూషన్‌లో ఉన్నటువంటి ప్రియాంబుల్, డైరెక్టివ్ ప్రిన్సిపుల్స్, 1947 లో ఎ. ఐ. సి. సి. చేసినటువంటి తీర్మానం ముఖ్యమంత్రిగారికి నేను జ్ఞాపకం చేస్తున్నాను. నేను అందులో ఆఖరుదానిని మాత్రం చదువుతాను.

"Our aim should be to evolve an economic structure which will yield maximum production without the creation of private monopolies and concentration of wealth and which will create proper balance between urban and rural economies".

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం పరిశ్రమలలో 9 కోట్ల 37 లక్షలు పెట్టగా అందులో 6 కోట్ల చిల్లర ఈ రోజు ఒక వ్యక్తి చేతిలో ఉంచటం జరిగింది. ఇది 1947 లో ఆల్ ఇండియా కాంగ్రెస్ పార్టీ చేసిన తీర్మానానికి అనుగుణంగా ఉన్నదా అని చీఫ్‌మినిస్టర్‌గారిని అడుగుతున్నాను. ఉన్న ద్రవ్యమునంతా ఒక వ్యక్తి చేతిలోపెట్టి అతడు ఒక్కడే ధనవంతుడు కావటానికి మన ప్రభుత్వంయొక్క పాలసీ ఉపయోగపడుతోంది. మన ప్రభుత్వ పాలసీ ఇండస్ట్రియలైజేషన్‌కు ఉపయోగపడటంలేదు. బిర్లా చేతుల్లోకి, వారి ఏజన్సీక్రిందకు ఇన్ని పరిశ్రమలు పోవటానికి కారణం ఏమిటి? "ఆంధ్రప్రదేశ్ ఏర్పడకముందే, మేము రాకపూర్వమే ఈ ఏజన్సీస్ అన్నీ పోయాయి" అని ముఖ్యమంత్రిగారు చెప్పవచ్చును. అంతమాత్రంచేత, ఈ ప్రభుత్వంయొక్క బాధ్యత తీరిపోదని మనవిచేస్తున్నాను. మనచేతుల్లోంచి ఇన్ని పరిశ్రమలు ఎట్లాపోయాయి? ప్రభుత్వంపెట్టిన పెట్టుబడి బిర్లా చేతుల్లోకి పోవటానికి కారణం ఏమిటి, అని అడుగుతున్నాను. కాంగ్రెసు చేసిన తీర్మానాలకు, ప్రభుత్వం యొక్క సిద్ధాంతాలకు అనుగుణంగా వ్యవహారం చేయవలసిన బాధ్యత ఈ ప్రభుత్వం మీద ఉన్నది. ఒకప్పుడు నాహిబిల్గ్రామియా అనేవారు ఇక్కడ సెక్రటరీగా ఉంటూవచ్చారు. ఆయన ఇప్పుడు "కంట్రోలర్ ఆఫ్ ఇంపోర్ట్స్ అండ్ ఎక్స్‌పోర్ట్సు" ఉద్యోగంలో ఢిల్లీలో ఉంటున్నారు. ఆయన కాలంలో ఈ ఇండస్ట్రీస్ అన్నీ బిర్లా మేనేజిమెంట్ క్రిందకు పోయాయి; అన్నది మనకు రికార్డులమూలంగా తెలుస్తున్నది. ఈయనగురించి మనం చాలా సందేహించవలసిఉన్నది. దీనిని గురించి విచారించి తగు చర్యలు తీసుకోవాలని కోరుతున్నాను. ఇప్పటికైనా, ఈపరిశ్రమలన్నీ ఇద్దరు ముగ్గురు వ్యక్తుల చేతుల్లో కాన్‌సన్‌ట్రేట్ కాకుండా చూడాలి. ప్రభుత్వం పెట్టిన పెట్టుబడి డబ్బు సక్రమంగా వినియోగింపబడేటట్లు చూడాలి. కాంగ్రెస్‌పార్టీ చేసిన

తీర్మానాలకు, ప్రభుత్వంయొక్క సిద్ధాంతాలకు అనుగుణంగా వ్యవహారం చేయాలని నేను చెబుతున్నాను.

శ్రీ యస్. సంజీవరెడ్డి : మిస్టర్ స్పీకర్ సర్, ఇప్పుడు నేను దీర్ఘోపన్యాసం చేయదలచుకోలేదు. పెద్ద ఉపన్యాసం ఇవ్వవలసిన ఆవశ్యకత సభ్యులు కలిగించలేదు. సభ్యులు కొన్ని సలహాలు చెప్పినారు. కాటేజ్ ఇండస్ట్రీస్ గురించి చాలామంది మాట్లాడారు. టేనరీస్ గురించి, ఖాదీగురించి చెప్పినారు. 'సెపరేట్ బోర్డు లేకపోవడంవల్ల ఆంధ్రకు ఇబ్బంది కలుగుతున్నది. దానికి ఒక సెపరేట్ బోర్డు క్రియేట్ చేసుకొంటే, హెచ్చుగా డబ్బు ఖర్చుపెట్టటానికి వీలవుతుంది; ఈ పరిశ్రమలు అభివృద్ధి అవుతాయి." అని కొందరు సభ్యులు సూచించారు. వారి సూచనలను మేము అంగీకరిస్తున్నాము. సెపరేట్ బోర్డు క్రియేట్ చేయడానికి ప్రభుత్వం అప్పుడే చర్య పుచ్చుకొంటున్నది. ఆంధ్రప్రదేశ్ అంతటికీ కలిపి ఒక బోర్డు ఏర్పాటు చేసుకోవటానికి చట్ట సమ్మతమైన ఇబ్బందులు ఉన్నాయి. ఆ చట్టాలను సవరించటం కష్టంగా ఉంది. హైదరాబాదులో ఉన్న ఖాదీబోర్డు రద్దుచేసే అధికారం మనకు మాత్రమే లేదు. ఇది మూడు ప్రభుత్వాలకు సంబంధించి ఉంది. ఇలాంటి చట్ట సమ్మతమైన ఇబ్బందులు ఉండటంవల్ల ఆలస్యం అవుతున్నది తప్ప, మన ప్రభుత్వం యొక్క అజాగ్రత్తవల్ల కాదు. ఇక్కడ తక్కువ డబ్బు ఖర్చుపెట్టాలనే ఉద్దేశంలేదు సెపరేట్ బోర్డు క్రియేట్ చేయటానికి లేదా ఒక బోర్డుగా ఇంటిగ్రేట్ చేయటానికి ప్రభుత్వం అప్పుడే చర్య పుచ్చుకొంటున్నది.

"టేనరీస్‌కు ప్రభుత్వంవారు ఖర్చుపెడుతున్నారు కాని యీ డబ్బు ఎవరికో ముట్టుతోంది; హరిజనులకు ముట్టటంలేదు. ఆ వృత్తి చేసుకొనే కులం వారికి ముట్టటంలేదు" దని కొందరు చెప్పినారు. ప్రభుత్వంవారు ఆ వృత్తికి సహాయం చేస్తున్నారు గాని, ఆ వృత్తి చేసే కులం వారికి కాదు, ఆ కులంవారే యీ వృత్తి చేయాలని ఏమీలేదు. ఈ రోజున అన్ని కులాలవారు అన్ని వృత్తులు చేస్తున్నారు. ఈ వృత్తి అవలంబించిన ప్రతివారికి — వారు ఏకులంవారైనా - ప్రభుత్వం సహకారం ఇవ్వాలిగాని, ఒక కులానికి శాశ్వతంగా ఒక వృత్తి అనేది లేదు. అన్ని రంగాల్లో అన్ని కులాలవారు వస్తున్నారు. కాబట్టి అందరికి సహకారం ఇవ్వాలి. ఈ వృత్తి అభివృద్ధి కావాలనే దానితో మేము [illegible] ప్రోత్సహిస్తున్నాము. ఈ వృత్తికి ఇంకా ఎక్కువ డబ్బు ఇవ్వటానికి ఆలోచిస్తాము. [illegible] విజయవాడలో [illegible] ఏర్పాటు చేయాలని [illegible] ఇంకా కొంత డబ్బు [illegible] ప్రభుత్వం [illegible]

చాలామంది సభ్యులు మేజర్ ఇండస్ట్రీస్ గురించి మాట్లాడారు. ఒక పార్టీ లీడర్ అయిన రత్నసభాపతిగారికి 20 నిమిషాలు టైము ఇవ్వటంచేత, వారు ఇతర సభ్యులు చెప్పిన విషయాలన్నీ క్రోడీకరించి చెప్పారు. వారు సిర్‌సిల్క్, సిర్‌పూర్ మిల్లులగురించి చెప్పారు. "ఆ డబ్బు అంతా బిర్లాలకు ఎందుకు ఇచ్చారు?" అని అంటున్నారు. వారు చెప్పినదానిని బట్టిచూస్తే, బిర్లాలకు మనం డబ్బు దానం ఇచ్చినట్లుగా కనుపిస్తున్నది. వారికి మనం ఎప్పుడు దానం ఇచ్చాము, అని అనిపించింది. "మూడు, నాలుగు కోట్ల రూపాయలు ఇచ్చారే? ఆ డబ్బు అంతా తిరిగి ఎందుకు తీసుకోకూడదు? ఆ డబ్బు ఎందుకు ఇతర ఇండస్ట్రీసులో పెట్టకూడదు? ఆల్విన్స్‌లో ఎందుకు పెట్టకూడదు? కోల్ ఫీల్డ్స్‌మీద ఎందుకు ఇన్‌వెస్ట్ చేయకూడదు?" అని అంటున్నారు. ఆ డబ్బు ఇప్పుడు ఇచ్చిందికాదు. బిర్లాస్ వచ్చినతర్వాత ఇచ్చిందికాదు. బిర్లాస్ రానిరోజుల్లో, యీ పరిశ్రమలకు నష్టం వస్తున్న రోజుల్లో అప్పటి ప్రభుత్వం యీ డబ్బు ఇచ్చింది. ఆ ఇండస్ట్రీస్ బిర్లావారికి స్వాధీనం చేసినవెంటనే 'మా అప్పు అంతా మాకు ఇచ్చేయమంటే" బిర్లావారేకాదు, ఎవ్వరూ ఇవ్వలేరు. ఆ ఇండస్ట్రీస్ డెవలెప్ అయితే, ఎడ్డీతోసహా నెమ్మదిగా 'రీ-పే' చేయవచ్చుగాని, "ఆ డబ్బు నాకు వెంటనే రీ-పే చేయమంటే" ఆ ఇండస్ట్రీ ఒక రోజులో కొలేప్స్ అయిపోతుంది. వారు జింక్‌షీట్స్, మిషనరీ అమ్మి మన అప్పు తీర్చాలి. ఆ పరిశ్రమను చంపివేయాలంటే "మా అప్పు ఇచ్చివెళ్లిపో" అని కోరవచ్చు. కాని పరిశ్రమలను చంపే ఉద్దేశం మనదికాదు. అప్పు వెంటనే వసూలుచేసి, ఆ పరిశ్రమలను చంపటం మన ఉద్దేశంకాదు. ఆ పరిశ్రమలను అభివృద్ధి చేయాలనేది మన ఉద్దేశం కాబట్టి, వాటికి తగిన ప్రోత్సాహంఇస్తూ, మన వడ్డీ పోకుండా "అసలు" పోకుండా చూసుకోవలసిఉంటుంది. వారు అప్పుడేకొంత "రీ-పే" చేశారు. వారు ఇప్పటికి 103 లక్షల రూపాయల అప్పు తీర్చారు. వారు ఆవిధంగా ప్రతి సంవత్సరం తీరుస్తూనేఉన్నారు.

సభ్యులు హేమలతా టెక్స్టయిల్స్‌గురించి చెప్పారు. దానికెంత అప్పు ఇచ్చారని అడుగుతున్నారు. వారికి అప్పు ఇప్పుడుకాదు ఇచ్చింది. ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన తర్వాతకూడ కాదు, వారికి అప్పు ఇచ్చింది. పూర్వం మద్రాసు ప్రభుత్వం ఇచ్చిన అప్పు అది. ఆ మిల్లు బాగా పనిచేస్తున్నది. అప్పటినుంచి యీనాటివరకు వారు డబ్బు చెల్లిస్తూనే ఉన్నారు. వారు ఏ సంవత్సరంలో ఎంత ఇచ్చారో వెంటనే చెప్పమంటే చెప్పలేను. వారికి ఇచ్చిన అప్పు వారు తీరుస్తూనే ఉన్నారు. అది ఇప్పుడు బాగానే పనిచేస్తున్నది.

మిగిలిన మిత్రులు విలేజ్ ఇండస్ట్రీస్ గురించి మాట్లాడారు. 'ప్రాగాటూల్స్ మనం కేంద్రప్రభుత్వానికి ఎందుకు ఇవ్వాలి ? మనమే ఎందుకు నడుపకూడదు ?" అని చాలామంది అడిగారు. ఆ నిర్ణయం ఇప్పుడు తీసుకొన్నదికాదు. ఆంధ్రప్రదేశ్ ఏర్పడకపూర్వం, అప్పుడు ఉన్న ఇబ్బందులు గమనించి, ఆ పరిశ్రమలకు వస్తున్న నష్టం గమనించి, హెచ్చు కేపిటల్ పెట్టి, కనీసం ఒక కోటి రూపాయలైనా ఖర్చుపెట్టి దానిని అభివృద్ధి చేస్తే, హెచ్చులాభాలు రావటానికి వీలవుతుందన్న ఉద్దేశంతో, అప్పటి ప్రభుత్వం యీ నిర్ణయానికి వచ్చింది.

మనకు డబ్బు ఉంటే, కోల్ ఫీల్డ్స్‌పైన ఖర్చుపెట్టవచ్చును. మనదగ్గర డబ్బు ఉంటే, ఆల్విన్స్ మనమే స్వాధీనం చేసుకొని డబ్బు ఖర్చుపెట్టటానికి వీలుండేది.

Allwyn Metal Works విషయములో ప్రభుత్వమువద్ద డబ్బు ఉన్నట్లయితే Special Officer ను వేయటానికి గాని ఇతర ఏజన్సీలతో అవసరము లేకుండా వాటిని స్వాధీనము చేసుకోటానికి గాని వీలుగాఉండేది. డబ్బులేకపోవడం వల్లనే బిర్లాకు యివ్వవలసి వచ్చింది. బిర్లాకు యిచ్చినంత మాత్రాననే ప్రైవేటు ఏజన్సీలకు ఎందువల్ల యిచ్చారని అంటున్నారు. Government of India అంటే ఎవరూ పరాయివాళ్లు కాదు. వాళ్లుకూడ మనవాళ్లే- ఆ డబ్బు ఎక్కడినుంచో అమెరికా నుంచి గాని, రష్యానుంచి గాని వచ్చినది కాదు. మనము pay చేసిన ప్రతి అణాకూడ ఢిల్లీ ప్రభుత్వానికే pay చేస్తున్నాము. వారికి ఇస్తే, అదిగూడ ఒక తప్పుగా మాట్లాడుతున్నారు. ప్రాగాటూల్సు ఇండియాలోకల్లా మంచి industry యే నని మన రత్నసభాపతిగారు కూడ ఒప్పుకుంటున్నారు. మనము పరిశ్రమలను ఎట్లాగైనా అభివృద్ధికి తేవాలని అనుకుంటున్నాము. అవి బాగా అభివృద్ధి అయితే తప్ప లాభములేదు. కాని గత సంవత్సరము వరకు ప్రతి సంవత్సరము కూడ నష్టము వస్తూనే ఉన్నది. గతసంవత్సరము, యీసంవత్సరము అంతో ఇంతో కొద్దిగా లాభమువస్తున్నది. కాని దానిని అంత పెద్ద ఆదాయముగా తీసుకోటానికి వీలులేదు. కాని ఇంకా ఒక కోటి రూపాయలు దానిమీద ఖర్చుచేస్తే ఇంకా ఎక్కువ ఆదాయము రావటానికి వీలు అవుతుంది. కాని అంతసొమ్ము పెట్టుబడి పెట్టే పరిస్థితులలో ప్రభుత్వము లేదు. అయినను Government of India వారికి ఇవ్వడము మంచిది అని అనుకోవడములో తప్పేమీ లేదు. "తొమ్మిది కోట్లతో [illegible] బిర్లాకు ఇచ్చారేమిటి ? వాళ్ళకు ఎట్లా ఇచ్చారు" అని అన్నారు. ఈ సొమ్ము యీ ప్రభుత్వము యిచ్చింది కాదు. గత హైదరాబాదు ప్రభుత్వమే యిచ్చింది. అయినప్పటికీ యీ విషయములో విచారణ చేయించవలసిందని

సభ్యులు అడుగుతున్నారు. దీనికి విచారణ చేయవలసినది ఏమి ఉంటుంది ? వారికి యీ డబ్బు యిచ్చింది మేనేజిమెంటు కొరకు మాత్రమే. అయినను యీ ఆరుకోట్లు కూడ వారికి దానముగా ఇవ్వలేదు. బిర్లావారు మేనేజిమెంటులోనికి వచ్చిన తరువాత యీ మూడు సంవత్సరములలో వారు ఏమైనా ఖర్చు చేశారా, ప్రభుత్వము పెట్టిన డబ్బేకాకుండా, సిర్పూరు మిల్సులోను, సిర్‌సిల్కులోనూ వాళ్ళు ఏమైనా capital తెచ్చిపెట్టారా, వారు యింకా డబ్బుతెచ్చి యిందులో పెట్టి యీ industryని develop చేశారా, లేదా అనేది మనము పరిశీలించాల్సి ఉన్నది Industries ను develop చేసి, యిందులో ఎక్కువగ లాభము సంపాదించటానికే గదా వాళ్లు యీ వ్యాపారం చేస్తున్నారు, వారుయిది అంతా చేసేది ఏదో దేశోద్ధరణ కొరకు కాదు. లాభము సంపాదించాలనే యీ వ్యాపారంలోనికి దిగారు. వాళ్ళు యివి develop చేయాలని, యింకొక industry ని start చేయాలని కృషి చేస్తున్నారు. నాకు యిప్పటివరకు వచ్చిన information ను బట్టి బిర్లావారు ఈ సిర్పూరు, సిర్‌సిల్కు, స్వాధీనము చేసుకున్న తరువాత, మన ప్రభుత్వానికి ఉన్న షేరుధనము కాక, రెండు కోట్లు share capital లోకూడ గత సంవత్సరము దానిని అభివృద్ధి పరచారు. పేపరు మిల్సులో 1.56 కోట్లు అభివృద్ధి పరచారు. Shares కొనడములో నైతేనేమి, ఇతరుల వద్దనుంచి అప్పులు తెచ్చిపెట్టడములో నైతేనేమి, ఏదోవిధముగ అభివృద్ధి పరచారు. కొత్త machinery ని import చేసుకుని Paper Mills లోని production యింకా ఎక్కువ చేశారు. తద్వారా లాభాలను అభివృద్ధి పరచారు. పూర్వము ఎన్ని కోట్లు ప్రభుత్వము అప్పు యిచ్చినా నష్టమే వస్తూఉంది. అలాంటిది యిప్పుడు వారి కాళ్లమీద వారు నిలవబడ గలుగుతున్నారు. అంతేకాకుండా కొద్దిగా లాభము సంపాదించి ప్రభుత్వము యొక్క అప్పును కూడ కొద్ది కొద్దిగా తీర్చుతున్నారు. ఇది మంచి పద్ధతికాదు,ఈ పద్ధతి అనుసరిస్తే బాగుంటుంది అని ఎవరైనా చెబితే నేను తప్పకుండా ఆ పద్ధతిని అనుసరించేవాడినే. వారి agency ని మనము ఒక్కసారిగా తీసివేయలేము. మనము వారిని తీసి వేస్తామని అనుకుంటే, వారుబైట నుంచి capital తీసుకొనివచ్చి యిందులో పెట్టరు. అదే వారికి వచ్చిన అనుమానము ఈనాడు. Allwyn Metal Works, Asbestos విషయములో కూడ బిర్లా వారికివుండే అనుమానము ఏమిటంటే, "మమ్ములను fresh capital తీసుకొని వచ్చి పెట్టమంటున్నారు. తరే మేము ఏ నలభై లక్షలో, యాభై లక్షలో తీసుకుని వచ్చి పెట్టాలేము. ప్రభుత్వానికి యిందులో majority of shares, అంటే యాభై పర్సెంటు ఉన్నది. ఇంతసొమ్ము తీసుకొచ్చి పెట్టిన మరుసంవత్సరమే మీరు మమ్ములను వెళ్ళిపొమ్మంటే, మేము ఏమిచేయాలి? అందువల్ల మేమెందుకు యింత సొమ్ము [illegible] ఈ [illegible] మేమెందుకు నష్టాన పెట్టుకోవాలి? మేము

ఎందుకు తెచ్చిపెట్టాలి. రేపు మీరు వెళ్లమంటే, మేము వెళ్ళిపోవలసిన పరిస్థితి ఎందుకు తెచ్చుకోవాలి" అని అన్నారు. Allwyn Metal Works లోను Asbestos లోను మనకు majority of shares ఉన్నవి గనుక మనమే వారికి terms ను dictate చేయవచ్చు. కాని సిర్పూరు, సిర్‌సిల్కు విషయములో ప్రభుత్వానికి 14% of the shares మాత్రమే ఉన్నవి. అలాంటప్పుడు మనము వారికి ఎట్లా dictate చేయగలము? మిగిలిన shareholders యొక్క shares అన్నీ చేరి 80% వున్నది. అలాంటప్పుడు మనము ఏమిచేయగలము? ఈసందర్భాలుఅన్నీ ఆలోచించకుండా మనం ఊరికనేఎవ్వరినీ నిందించి లాభములేదు. ఇంకను మనము వారిలో ఏదైనా తప్పు కని పెట్టి ఆతప్పులను సర్దుకోవటానికి ఆలోచించుకోవచ్చు. అవి వారికి hand over చేసి నది యీనాడుకాదు. అవి రెండు కూడ ప్రభుత్వము యొక్క కంపెనీలు కావు. సిర్పూరులో ప్రభుత్వానికి ఉన్న షేరు ధనము అంతా 25 పరసెంటో ఎంతో ఉన్నది. అది యిప్పుడు ఒక మాదిరిగ జరుగుతున్నది. ఇంతకుముందు ఆ కంపెనీలలో చాలా నష్టము వస్తున్నది. ప్రభుత్వాన్ని యింకా అప్పులు యివ్వండి, ఇవ్వండి అని అడుగుతూండేటటువంటి పరిస్థితులలో ఉన్నవి. అలాంటిది యిప్పుడు వారు ప్రభు త్వానికి యివ్వవలసిన అప్పు ఒక కోటికి పైగా తీర్చివేశారు. ఇప్పుడు ఏదో విధముగ లాభాలు సంపాదించి వృద్ధికి తెచ్చుకుని అప్పులు తీర్చేసమయములో మనము వాటిని చెడగొట్టకుండ, మన అప్పును మనకు వచ్చే విధానముకూడ మనము చూచుకోవాలి. అలా చేయటానికి వారికి అవకాశమును ఇవ్వాలి. అట్లా చేయకుండా మా అప్పు యిచ్చివేయండి అని ఒక్కసారిగా వాళ్ళను ఒత్తిడిచేస్తే, వాళ్ళు ఎట్లా ఇవ్వగలుగు తారు? ఇది ఎట్లా ఉంటుందంటే, బంగారుగ్రుడ్లు పెట్టే బాతును బ్రతకనియ్యకుండా చంపినట్లే అవుతుంది. అప్పు ఒక్కసారిగా కట్టమని చెప్పితే, అది అంతా అమ్మివేసి వెళ్లిపోతారు. ప్రభుత్వమునకు రావలసిన డబ్బు రాకుండా నష్టపడవలసి వస్తుంది.

ఇక మిగిలిన Industries ను గురించి మనమిత్రులు, శ్రీనివాసరావు వగైరాలు మాట్లాడుతూ Industrial Advisory Board ఎందువల్ల వేయలేదని అన్నారు. ఆ విషయము గురించి ప్రభుత్వము ప్రయత్నిస్తూనే ఉన్నది. త్వరలోనే రోజులలోనే అది పూర్తి అవుతుందని చెబుతున్నాను.

తరువాత Nationalised Transport విషయములో ఏదో partiality ఉన్నదని దానిని గురించి జాగ్రత్తగా ఆలోచించాలని ఒక మిత్రుడు అన్నాడు. వారు ఆ విధముగ చెప్పినందుకు నాకు సంతోషమే కాని, ఇందులో partiality జరగ టానికి అవకాశమే లేదు. ప్రభుత్వము యీ విషయములో ఒకటే policy ని అనుసరిస్తున్నది. ఇప్పుడు హైదరాబాదు నుంచి [illegible] వరకు ఒక రూటు

ఉన్నది. ఈ రూటులో ఉన్నవి ఎవరో ఒకరివి ఇద్దరివి కావు. ఎంతో మందివి ఉన్నవి. అటువంటప్పుడు అందరి బస్సులు complete గా తీసుకుంటూంటే, partiality అనేది ఎక్కడ వుంటుంది. ఆ రూటులో ఎవరు ఉన్నారో శ్రీనివాస రావుగారికి తెలియదు. నాకు తెలియదు. బోర్డులో ఉన్న రంగయ్యగారికి, షహా బుద్దీను గారికి కూడ తెలియదనే నా ఉద్దేశ్యము. అందులో ఎవరో ఉంటారు ఆ రూటులోని బస్సులు complete గా తీసుకున్నప్పుడు ఎవరైనాసరే, ఆ sweep లో వెళ్లి పోతూంటారు. కాబట్టి partiality కి అవకాశమే లేదు. Partiality వున్నదని affected party, aggrieved party గా వుండేటట్లు ఉండేవాళ్లు చెప్పవచ్చు. అది సహజమే కదా ; "నా బస్సు తీసుకున్నారే, ఎక్కడో ఏలూరులోని బస్సులు తీసుకోకూడదా ! శ్రీకాకుళంలోని బస్సు తీసుకోకూడదా" అని చెబుతారనుకుంటాను. అలాంటి వాళ్ళు అందరు interested parties గనుక, వాళ్ళు చెప్పేదానిలో నిజము ఉన్నదని భావించటానికి వీలులేదు. Partiality అంటే, ఒకరి బస్సు తీసుకుని అందులో యింకొకరి బస్సుపెట్టడం. అలా చేస్తే, అప్పుడు అడగవచ్చు. కాని అందులో ఒక ఇబ్బంది మాత్రము ఉంటే ఉండవచ్చు. హైదరాబాదు నుంచి ఒక్కసారిగా బందరు వరకు తీసుకోవడమా, లేక Government of India నుంచి యింకా డబ్బు రావటానికి 10,15 రోజులో, నెలరోజులో పడుతుంది గనుక, ఆ డబ్బుతో మనము బస్సులు కొనేవరకు నిలబెట్టడము అనేది మనము ఆలోచించుకోవాల్సి ఉంటుంది. అలాంటి ఇబ్బంది ఏమైనా ఉంటే, దానిని మనము Road Transport Conferance లో adjust చేసుకోవచ్చు. ఒకే బస్సు రూటులోఉన్న 14బస్సులలో 10బస్సులు తీసుకోవడము, నాలుగు నిలబెట్టడమనేది మాత్రము జరగదు. అలాంటిది మాత్రము జరగకుండా చూచుకుందాము. ఒకవేళ కార్పొరేషనువారు చేసినప్పటికినీ, అభ్యంతరము పెట్టే హక్కు మనకు ఉన్నదనుకుంటాను. ప్రభుత్వము interfere కావటానికి వీలున్నది.

తరువాత Co-operative Sugar Factories ను గురించి చాలామంది సభ్యులు మాట్లాడారు. "కేంద్రప్రభుత్వము ఇవ్వకపోతే, యీ ప్రభుత్వము, వారి పైన ఒత్తిడి తీసుకొని రావద్దా ? ఒక్కదానికే import licence ద్వారా machinery వస్తుందని అన్నారే, మనకు కావలసినది మనము తెప్పించుకోటానికి ఎందువల్ల వీలులేదు" అని అన్నారు. కాని నాకుమాత్రము ఒక నమ్మకము ఉన్నది. వత్తిడి తెచ్చినతరువాత కనీసము డబ్బు వసూలుచేసినటువంటివి మూడు, నాలుగైనా సరే, వాటికి licence లు గాని foreign exchange గాని ఏవైనా అడ్డము వస్తే, రాజగోపాలనాయుడుగారు పాతమిషినరీ అయినా తీసుకొనివచ్చి యీ

కార్యక్రమము ప్రారంభించవచ్చు అని సలహాయిచ్చారు గనుక, మనము ఆ ప్రకారము చేయవచ్చుననుకుంటాను. అలాంటిది వీలు అవుతుందేమో చూడాలి. కాని ఏ విధముగనైనాసరే యీ Co-operative Sugar Factory మాత్రము start చేసి తీరుతాము. రైతులకు ఒకసారి ఆశాభంగము కలుగజేస్తే, మరొకప్పుడు ఎప్పుడు కూడ వారు ముందుకు ఉత్సాహముతో రారు. ఉన్న ఉత్సాహము కాస్తా పోతుందని నా భయము. దీనిని ఈ సంవత్సరములో ఎప్పుడో తప్పకుండా ప్రారంభిస్తాము. ఇంతేకాకుండా ఇక్కడ ఉన్న నిజపరిస్థితికూడ మన గోపాలరెడ్డిగారికి తెలుసు. వారు ఢిల్లీకి వెళ్ళినప్పటికినీ మనకు తప్పకుండా యీ విషయములో సహాయము చేస్తారనే నమ్మకము నాకు ఇప్పుడిప్పుడు కలుగుతున్నది. మనము దానిని తప్పకుండా సాధించగలమని అనుకుంటున్నాను.

ఇక మన అంజయ్యగారు మాట్లాడుతూ Nizam Sugar Factory లో ఎవరినో Operating Director ను ప్రభుత్వము వేసింది. దానికి నేను ప్రభుత్వాన్ని అభినందిస్తున్నానని, అట్లాగే ఈ Sirpur, Sir Silks విషయములోకూడ ఎందువల్ల ఒకరినివేయకూడదు అని అన్నారు. మన ఇంటి పెత్తనమేఅయితే సాగించటానికి మనకు వీలుఉంది. పరాయి యింటి పెత్తనము మనము ఎట్లా చేయగలము? ఈ విషయము వారు ఆలోచించినట్లు లేదు. Nizam Sugar Factory అంటే, అందులో మనకు majority of shares ఉన్నవి. అందువల్ల దానిలో మనము Operating Director ను వేయటానికి మనకు కొంచెము హక్కు ఏర్పడింది. కాని సిర్పూరు, సిర్‌సిల్కు విషయము అట్లాకాదు. అందులో మనకు కొద్దిగానే shares ఉంటే, మనము Operating Director ను ఎట్లా వేయగలము? ఏ authority మీద? ఏచట్టము ప్రకారము వేయగలము? మనకుఉన్న షేర్లు చాలా కొద్దే. కనుక మనము అందులో జోక్యము కలిగించుకోటానికి వీలులేదు. ఏదైనా చట్ట సమ్మతముగా ఉండేది చేయాలి. చట్టమునకు విరుద్ధముగ చేయటానికి వీలులేదు.

ఇక మన శ్రీరామమూర్తిగారు యీసారి చాలా చక్కగా మాట్లాడారు. వారు ఆవిధముగ మాట్లాడింది ఇదే మొదటిసారి అనుకుంటున్నాను. ఇకముందు కూడ [illegible] ఆవిధముగనే మాట్లాడుతారని ఆశిస్తున్నాను. వారు మాట్లాడుతూ, [illegible] అందులో స్వతంత్రించి ఖర్చు చేయలేదే. అందువల్ల నాకు చాలా అనుమానముగ ఉన్నదని అన్నారు. వారికి సాధారణముగ అనుమానాలు వస్తావే [illegible] [illegible] [illegible] [illegible]. వారి స్వతంత్రించి [illegible] [illegible] [illegible] [illegible] [illegible] ఏ [illegible] [illegible] షామోత్రు తెచ్చిపెట్టి [illegible] [illegible] [illegible] [illegible] [illegible]

పీలు లేదుగదా ! అలాంటి అనుమానము ఏదైనాఉంటే, కంపెనీలో ఉన్న యితర డైరక్టర్లు, shareholders యిందులో డబ్బు వెయ్యరు. వారంతా జాగ్రత్తగానే అవతల ఉండేవారు గదా ! వారి డబ్బు అంతా తెచ్చి యిందులో పెట్టి, అది అంతను సులభముగ పోగొట్టుకోరు అనుకుంటాను. అందులో బిర్లావారు తీసుకునివచ్చిన shareholders చాలామంది ఉన్నారు. వారుకూడ డబ్బు యిచ్చారు. "Industrial sector లో 14½ కోట్ల రూపాయలు మాత్రమే ఖర్చు చేయడానికి మన ప్రభుత్వం నిర్ణయించింది' అని శ్రీమతి లక్ష్మీకాంతమ్మగారు అన్నారు. అది నిజమే. ఆంధ్రరాష్ట్రంలో irrigation కు, power కూ ఎక్కువ prominance ఇచ్చాము Industries కు అంత ప్రాముఖ్యత ఇవ్వలేదు. Major Industries కు ఎప్పుడూ central sector లోనే ఉండాలి. వాటిని రాష్ట్ర ప్రభుత్వాలు భరించలేవు భిలాయ్‌స్టీల్‌ప్లాంట్ గాని, fertilizer factory గాని— యిటువంటివన్నీ central sector లోనే తయారైనాయి. State Governments ఆ భారాన్ని మోయలేవు. కాబట్టి మోయలేని భారాన్ని తెచ్చుకొని బాధపడకుండా యీ 14½ కోట్ల రూపాయలతోనే paper mills, సిరమిక్ ఫ్యాక్టరీ మొదలైన వాటిని అభివృద్ధి చేసుకొనేందుకు నిర్ణయించుకున్నాము. Heavy industries కొన్ని కోట్ల రూపాయల ఖర్చుతో తయారయ్యేవన్నీ ఢిల్లీ ప్రభుత్వం యొక్క సహాయ, సహకారాలతోనే స్థాపించబడవలసి యున్నది. మన రాష్ట్ర ప్రభుత్వమే కాదు, ఏ రాష్ట్రప్రభుత్వము కూడ యిట్టి బలీయమైన కార్యక్రమాలకుపూనుకోలేవని చెబుతున్నాను.

చర్మకార వృత్తులగురించి, అందులోని సమస్యల గురించి కొంతమంది సభ్యులు చెప్పారు. మౌలాసాహెబ్‌గారు, బి. జి. యం. ఎ. నరసింగరావుగారు సిమెంటు, షుగర్‌ఫ్యాక్టరీల అభివృద్ధికి ప్రభుత్వం ఎక్కువ డబ్బు ఇవ్వాలని చెప్పారు. చాలాసంతోషం కలిగింది. అట్లా ఇవ్వాలనే ప్రభుత్వోద్దేశం. ఇంకా కొంత మంది మిత్రులు కేంద్రప్రభుత్వం సహకారం ఇవ్వడం లేదని చెప్పారు. మనమంద రమూ Central Government పైన ఒత్తిడి చేయాలన్నారు. కాని, అంత ఒత్తిడి చేయవలసిన అవసరం లేదనుకొంటాను. మనం ఇక్కడ చేస్తున్న ఉపన్యాసాలన్నీ కేంద్ర ప్రభుత్వానికి తెలుస్తూనే ఉన్నాయి. సభ్యులు ఇచ్చిన సలహాలే మాకు బలం. "Coal Fields ను Central Government కు పోనీయకూడదు." అని క్రిందటి సమావేశంలో చాలామంది సభ్యులు చెప్పడంవలననే మేము అందుకనుగుణముగా చర్యలు తీసుకోగలిగినాము. 'ఢిల్లీ ప్రభుత్వానికి 60% ఇచ్చి అప్పుతీసుకునేవటట్లు'గా అంతకు పూర్వమే decide అయి వున్నది. సభ్యుల అభిప్రాయాలు తెలిపినతరువాతనే దానిని reverse చేయగలిగాము.

మనం ఎందుకు నడపలేము, ఢిల్లీ ప్రభుత్వానికి ఎందుకు ఇవ్వాలి? అని యీనాడు Praga Tools విషయంలో సభ్యులంతా చెప్పినట్లుగానే గతసంవత్సరం బడ్జెట్ సమావేశములో Coal Fields ను గురించి చెప్పడంవల్ల మేము ఢిల్లీపోయి మనఅభిప్రాయాన్ని చెప్పగలిగినాము. మొదట అనుకొన్న policy ని reverse చేసి, Coal Fields ను State Government స్వాధీనంలోనే ఉంచుకుని కంపెనీ నడుపుటకు నిశ్చయించుకున్నాము. సభ్యుల అభిప్రాయాల బలంతో ప్రజల బలంతో ఢిల్లీ ప్రభుత్వానికి ఏమైనా చెప్పాలంటే చెప్పగలము. అక్కడ ఉన్నదికూడా మన ప్రభుత్వమే. వారు మనమాటలను తప్పకుండా అంగీకరిస్తారు. మనకు పరాయి వాళ్లుకారు. ప్రజాభిప్రాయం తెలియనివారు కారు. కాబట్టి మనం వారిమీదపడి బ్రహ్మాండంగా ఒత్తిడి చేయనక్కరలేదు. వారిని ఒప్పించగలము.

'Election Fund అని Sugar Factory వారు ఒకసారి 50 వేల రూపాయలు, మరొకసారి 50 వేల రూపాయలు—మొత్తం లక్షరూపాయలు ఇచ్చారు' అన్నారు. ఏదైనా illegal గాచేసివుంటే మనం action తీసుకోడానికి వీలవుతుంది. 'Ex-Ministers కూ, Ministers కూ ఏదో ఇచ్చారు' అన్నారు. చందాలు యివ్వడం అనే ఆచారం యిదివరకెప్పుడైనా ఉన్నదా? ఇస్తున్నారా? లేక ఎవరైనా ఒక వ్యక్తిపోయి సంపాదించుకున్నాడా అనే విషయం జాగ్రతగా ఆలోచించాలి.

*(Sri B. Ratnasabhapathi rose in his seat)*

*Mr. Speaker* :- First of all, the hon. Member has to seek my permission?

***Sri B. Ratnasabhapathi:*** Yes sir. కంపెనీ చట్టం pass అయినది. దానిలోని sec. 293 (1) (e) 3 లో బడి చందాలు ఇవ్వడం జరిగిందా; లేక ఆ సెక్షనును violate చేసినారా అనేది తెలుసుకోవాలి.

శ్రీ యన్. సంజీవరెడ్డి: దేశంలో యింకా చాలా కంపెనీలు ఉన్నాయి. నిజాం షుగర్ ఫ్యాక్టరీ క్రొత్తగా రాలేదు. బొంబాయిలోనూ కలకత్తాలోనూ, అన్నిచోట్లా చట్టప్రకారమే జరుగుతున్నాయి. చట్టానికి విరుద్ధంగా జరిగివుంటే సభ్యులు చెప్పినట్లుగా ఏమైనా చర్యలు తీసుకోడానికి అవకాశం ఉంటుంది. చట్టప్రకారం జరిగిందా, లేక విరుద్ధంగా జరిగిందా అనేది విచారించి కొన్నతరువాత ఏదైనా చేయాలి. ఇదే మొదటిదికాదు, కాలేజీలకు యిస్తారు, Institutions కు యిస్తారు. ఈ ఒక్క కంపెనీయే కాదు, అన్నికంపెనీలు యిస్తున్నారు. చట్టవిరుద్ధంగా ఉంటా,

లేదా అనే legal point సభ్యులు అడుగుతున్నారు. నేను lawyer ను కాను లక్షణదాసుగారు ఉత్సాహంగా మాట్లాడదలంచుకొన్నారు, కాని వారికి time లభ్యం కాకపోవడం వలన jute factory విషయం నాకు చెప్పారు. మనకు అవసర మైనన్ని jute factories లేకపోవడంవల్ల శ్రీకాకుళం, విశాఖపట్నాలలోని రైతాంగం చాలా నష్టపడుతున్నారు. మనకు jute factory ఒక్కటే ఉన్నది. ఇంకా ఫ్యాక్టరీలను ఏర్పాటు చేసుకోడానికి Central Government నుంచి assistence తీసుకోడానికి ప్రయత్నం చేస్తారా అని లక్షణదాసుగారు అడిగారు. మనం ఇంకా. ఒకటి రెండు jute factories ను పెట్టుకోవలసిన capacity ఉన్నది. కాని అవిషయమై యిప్పుడు off-hand గా నేనేమీ చెప్పలేను. Central Government నుంచి ఎంతవరకు assistance లభిస్తుందో చూడవలసియున్నది.

లక్ష్మీకాంతమ్మగారు ఉపన్యాసంలో చాలావిషయాలు చెప్పారు. Time తక్కువగా ఉన్నందువల్ల యింకా కొన్ని విషయాలను చెప్పలేకపోయినారు. Co-operative Sugar Factory ని గురించి యింకొక 4 points వ్రాసి నాకు పంపించారు. ఆవిషయాన్నికూడా పరిశీలన చేస్తాము. పరిశ్రమలను అభివృద్ధి పరచాలి, ప్రభుత్వం డబ్బు పోకూడదు; అనే విషయాలతో మనమందరమూ ఏకాభిప్రాయంతో ఉన్నాము. ఏమైనా పొరపాట్లు ఉంటే యీ విధంగా సరిదిద్దవచ్చునని ఎవరైన సలహాలిస్తే బాగుంటుంది. Allwyn Metal Works విషయంలో capital లేక పోవడంవలన 10 సంవత్సరాల కండిషన్ పెట్టుకొని యివ్వడానికి ఆలోచిస్తున్నామనీ, 50 రూపాయల share ను రు. 10 కి తగ్గించాలనుకొంటున్నామనీ, నేను చెప్పినాను. ఇంకోవిధంగా చేయమని ఎవరైనా సలహా చెబుతారేమోననే ఉద్దేశంతో నేను అట్లా చెప్పినాను. నేను యీ వ్యవహారమంతా తెలిసి జేయుటలేదు, తెలియకపోవడంవలననే మీ సలహాలు కావాలని కోరుతున్నాను. ఈ పద్ధతి తప్పు, ఇంకొకవిధంగా చేస్తే ప్రభుత్వానికి, ప్రజలకు లాభంవస్తుంది అని ఎవరైనా వారికి తోచిన సలహా లివవచ్చును. ఏ పద్ధతి అనుసరించడంవల్ల ప్రజలకూ, ప్రభుత్వానికీ లాభం కలుగుతుంది అనేదృష్టితోనే 'how the Government is thinking" అనే lines పై సభ్యులకు తెలియచేశాను.

కమ్యూనిస్టా, సోషలిస్టా, కాంగ్రెసా అనే విషయం కాదు యిపుడున్నది. ఏవిధంగా చేస్తే ప్రభుత్వానికి రు. 10 లాభం కల్గుతుంది అనే దృష్టితో అందరము ఆలోచిస్తున్నాము. కాని ఇందులో చాలా ఇబ్బందులున్నాయి. ఆ ఇబ్బందులను దాటి బయటపడడం ఎట్లాగో ఎవ్వరమూ చెప్పలేకపోతున్నాము. ఇబ్బందులున్నాయని అందరకూ తెలుసు.

ఏమి చేస్తే ఏమి జరుగుతుందో అనే శంకతో Cabinet లోకి వచ్చిన ప్రతి subject నూ కనీసం మూడుసార్లైనా post-pone చేస్తుంటాను. Secretariat Officers మీటింగు పెట్టుకుంటారు Cabinet Sub-Committees వేస్తున్నాము. అప్పుడు Cabinet లోకివస్తుంది. కాని ఇదిఅంత సులభమైన విషయంకాదు. పెద్ద Industrialists, గాని Jugglary of figures తెలిసినవారెవ్వరూలేరు. అందరి సహకారం పొందుతున్నాము త్వరలోనే Industrial Advisory Committee ని వేస్తున్నాము. అందులో యీ రాష్ట్రము వారినే కాక, వ్యాపార విషయాలు బాగా తెలిసి (dis-interested persons) వ్యాపారంలో ఇరుకుకోకుండా ఉండే వారిని బొంబాయి నుంచి ఒకరిద్దరినీ, మద్రాసునుంచి ఒకరిద్దరినీ తెచ్చుకొని వారి సలహా సంప్రదింపుల ద్వారా యింకా ఎక్కువ లాభాలు వచ్చేటట్లు చేయాలని ప్రయత్నిస్తున్నాము. సభ్యులు సలహాలు ఇవ్వవలసినది యీ ఒక్కనాడే కాదు. వారు వ్రాసి పంపవచ్చు. లేక నాతో discuss చేసినా చేయవచ్చు. ఈ విధంగా చేస్తే దేశానికి మంచిది, లాభం కలుగుతుంది అని వారికేదైనా తోచి, నాకు సలహానిస్తే నేను సంతోషపూర్వకంగా స్వీకరించడానికి సిద్ధంగాఉన్నానని మనవిచేస్తున్నాను. ఈ amount ను sanction చేయవలసినదిగా సభవారిని కోరుతున్నాను

*Demand No. XXIV-Industries-Rs. 1,66,97,800/-*

*Mr. Speaker :* The question is:

To reduce the allotment of Rs. 1,66,97,800
for Industries by Rs. 100/-

To start more industries

To reduce the allotment of Rs. 1,66,97,800
for Industries by Rs. 100/-

కుటీర పరిశ్రమలకు కేంద్ర ప్రభుత్వంనుండి రావలసిన విరాళాల సమయంలో సంపాదన పోగొట్టుకొంటున్న ప్రభుత్వ విధానాన్ని విమర్శించుటకు.

To reduce the allotment of Rs. 1,66,97,800
for Industries by Rs. 100/-

To impress on the Government for starting Fertiliser Factory in Andhra Pradesh.

The motions were negatived.

*Mr. Speaker*: The question is:

To reduce the allotment of Rs. 1,66,97,800
for Industries by Rs. 100/-

For the failure of Government to bring all village artisans to work by organising Small Scale Industries.

The motion was negatived.

*Sri M. Satyanarayana Raju:* I demand a division, Sir.

The House then divided.

Ayes 31; Noes. 72.

The motion was negatived.

*Mr. Speaker:* The question is:

To reduce the allotment of Rs. 1,66,97,800
for Industries by Rs. 100/-

నిర్మల్ ఇత్తడి పారిశ్రామిక సహకార సంఘమునకు యేవిధమైన ధనసహాయము యివ్వలేనందున

To reduce the allotment of Rs. 1,66,97,800
for Industries by Rs. 100/-

ప్రతి తాలూకాలో చేతిపనుల పరిశ్రమ ప్రభుత్వకేంద్రములను స్థాపింపలేని అసమర్థతను గురించి.

To reduce the allotment of Rs. 1,66,97,800
for Industries by Rs. 100/-

నిర్మల వెదురు సహకారసంఘమునకు కావలసిన వెదురు కలుగజేయనందులకు.

To reduce the allotment of Rs. 1,66,97,800
for Industries by Rs. 100/-

జోగిపేటలో ప్రసిద్ధమైన, ప్రాచీనమైన చర్మపరిశ్రమ సొసైటీవారికి ఋణము యివ్వని ప్రభుత్వ విధానమును విమర్శించగలందులకు

The motions were negatived.

*Mr. Speaker:* The question is:

To reduce the allotment of Rs. 1,66,97,800
for Industries by Rs. 100/-

For the failure of the Government to constitute non-official committees to go into the working of the Industries under Government management.

The motion was negatived.

*Sri Pillalamarri Venkateswarlu* : I demand division, Sir.

The House then divided.

Ayes: 31; Noes: 75.

The motion was negatived.

*Mr. Speaker*: The question is:

To reduce the allotment of Rs. 1,66,97,800/- for Industries by Rs. 100/-

ప్రభుత్వం యొక్క పారిశ్రామిక విధానమును విమర్శించుటకు

The motion was negatived.

*Mr. Speaker* : The question is:

To reduce the allotment of Rs. 1,66,97,800/- for Industries by Rs. 100/-

ఆంధ్రప్రదేశ్‌లో ప్రభుత్వమునకు ప్రధానభాగం గల పరిశ్రమలు సక్రమంగా పనిచేయించి, వాటివల్ల లాభం వచ్చునట్లు చేయుటలో చాలవరకు విఫలమగుటను విమర్శించుటకు

To reduce the allotment of Rs. 1,66,97,800/- for Industries by Rs. 100/-

ఆంధ్ర ప్రదేశ్‌లో పరిశ్రమాభివృద్ధికై సక్రమచర్యలు తీసుకోకపోవటాన్ని విమర్శించుటకు

The motions were negatived.

*Mr. Speaker*: The question is:

To reduce the allotment of Rs. 1,66,97,800/- for Industries by Rs. 100/-

కుటీర పరిశ్రమలకై ప్రభుత్వము ఇచ్చిన ఋణముల వివరములు తెలిసికొనుటకు.

To reduce the allotment of Rs. 1,66,97,800/- for Industries by Rs. 100/-

ఎరువుల ఫ్యాక్టరీలు స్థాపించవలయుటకు

The motions were negatived.

*Mr. Speaker*: The question is:

To reduce the allotment of Rs. 1,66,97,800/- for Industries by Rs. 100/-

కుటీర పరిశ్రమల అభివృద్ధికై జిల్లాలలో తగు ప్రోత్సాహము, మరియు ఆర్థిక సహాయము చేయనందులకు

The motion was negatived.

*Sri Krishnamachari:* I demand a division, Sir.

The House then divided.

Ayes: 31; Noes: 80

The motion was negatived.

*Mr. Speaker:* The question is:

To reduce the allotment of Rs. 1,66,97,800/- for Industries by Rs. 100/-

To discuss the failure of the Government to nationalise the Bodhan Sugar Factory in which Government have 75% of shares.

To reduce the allotment of Rs. 1,66,97,800/- for Industries by Rs. 100/

To discuss the failure of the Government to take suitable steps for starting a Fertiliser Factory in the State.

To reduce the allotment of Rs. 1,66,97,800/- for Industries by Rs. 100/-

To discuss the retrogressive measures of the Government in handing over Government concerns to private managements and the Government's failure to avoid the mismanagement in Industries.

The motions were negatived.

*Mr. Speaker:* The question is:

To reduce the allotment of Rs. 1,66,97,800/- for Industries by Rs. 100/-

పరిశ్రమల నిర్వహణలో జరుగుతున్న అసమర్థత విధానాలనుగురించి, ప్రైవేట్ పరిశ్రమలలో పెట్టబడిన ప్రభుత్వ ధనం సద్వినియోగం జరుగునట్లుగా ప్రభుత్వ అజమాయిషీని ఏర్పర్చలేకపోవడం గురించి

To reduce the allotment of Rs. 1,66,97,800/-
for Industries by Rs. 100/-

కుటీర పరిశ్రమలకు తగిన ప్రోత్సాహం ఆచరణ రూపేణా యివ్వకపోవడం గురించి

The motions were negatived.

*Demand No. XLIII-Capital Outlay on Industrial Development—Rs.* 1,75,30,000

*Mr Speaker:* The question is:

To reduce the allotment of Rs. 1,75,30,000/-
for Capital Outlay on Industrial Development by Rs. 100/-

ప్రభుత్వ విధానం విమర్శించుటకు

The motion was negatived.

*Mr. Speaker:* The question is:

To reduce the allotment of Rs. 1,75,30,000/-
for Capital Outlay on Industrial Development by Rs. 100/-

నిజామాబాదులో షుగర్ ఫ్యాక్టరీ సహకార సూత్రిలపై స్థాపించేకొరకు ఆలస్యము చేయుచున్నందుకు

The motion was negatived.

*Mr. Speaker:* The question is:

To reduce the allotment of Rs. 1,75,30,000/-
for Capital Outlay on Industrial Development by Rs. 100/-

జోగిపేట చర్మ పరిశ్రిమ సహకార సంఘమునకు సహాయపడ ప్రభుత్వం గుర్తించగలందులకు.

The motion was negatived.

*Demand No. XXIV—Industries - Rs. 1,66,97,800.*

*Mr. Speaker:* The question is:

"That the Government be granted a sum not exceeding Rs. 1,66,97,800 under Demand No. XXIV—Industries"

The motion was adopted.

*Demand No. XLIII—Capital Out-lay on Industrial Development - Rs. 1,75,30,000.*

*Mr. Speaker:* The question is:

"That the Government be granted a sum not exceeding Rs. 1,75,30,000 under Demand No. XLIII—Capital Outlay on Industrial Development"

The motion was adopted.

*The House then adjourned till Half Past Eight of the Clock on Monday, the 24th March, 1958.*